ఒకతల్లిప్రాణంకాపాడడంకోసమై
తనఏకైకబిడ్డనేతనకుగాకుండా
చేసుకుని,చిత్రవధకుగురియవుతున్నా
సహించికుటుంబక్షేమాన్నేకోరుకున్న
పవిత్రమాతృమూర్తిగాథ!
మిమ్ముఅలరించేమహత్తరచిత్రం!



ఆజెమ్ ఆర్ట్సు

# తల్లి ప్రేమ



నిర్మాత: M. అజెమ్
దర్శకత్వం: శ్రీకాంత్
రచన. భమిడిపాటి రాధాకృష్ణ
సంగీతం. సుదర్శనం కళ. తోట

CHE PRASAD

పూర్ణా రిలీజ్

GOTETI

# ఉత్తరాలు

## కథలు

16—2—68 సంచికలో వేసిన 'ఆకాశగంగ' కథలోని భానుమూర్తి పాత్ర 'మానవుడిలో నేను ఎవరు?' అనే ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు అలా ఉత్పన్నమైన ప్రశ్నకు జవాబు వెతుకువాడే మహాయోగి అనే సత్యానికి మారుపేరు.

మనిషిలో మానవత్వం ఉన్నంతవరకు ఎప్పుడూ మానవుడు కాలేడు అలా నటించడం కూడ వ్యర్థం. ఆనేద 'మనిషి' అనే కథకు చక్కని ఉదాహరణ 'మనిష్వ ప్రేమించ లేవ'' రెడ్డిగారి కవిత ప్రేమస్వామి మధువుని వెదజల్లింది.

వి వి స్వామి (కరీంనగరం)

* * *

16—2—68 పత్రికలో కథలన్నీ చాల బాగున్నవి ముఖ్యంగా శ్రీ రంగధామగారి ''కడుపు తీపి'' శ్రీ కె సభాగారి ''ఆకాశగంగ'' చదువుతున్నప్పుడు సినిమా చూస్తున్నట్లనిపించింది ఇంత మంచి కథలు ప్రచురించిన మీకు, రచయితలకు నా అభివందనలు.

ఆర్ వెంకటరావు (మద్రాసు)

## ముఖచిత్రం

ఈ వారం (16—2—68) పత్రిక ముఖచిత్రం ఆకర్షణీయంగా వుంది కథలు మామూలుగానే వున్నాయి ముఖ్యంగా నన్నాకర్షించింది 'ఆకాశగంగ' అనే కె సభాగారి రచన ఆ కథ 20వ పేజీలో ''...సరస్వతి ముఖం నిండ పసుపు రాసుకొంది. పెద్ద తిలకం బొట్టు పెట్టుకొంది ..'' అని వ్రాశారు కాని తిలకం బొట్టు అనడానికి బదులు 'కుంకుమ బొట్టు' అంటే ఇంకా నిండుగా వుండేది

అన్యాయానికి గొడుగు పట్టిన భానుమూర్తికి జైలుశిక్ష వేయడం సామంజసంగా వుంది ఆఖరికి జైలు నుండి విడుదలై తిరుపతి చేరుకొని ఆకాశగంగలో స్నానం చేస్తూ చివరికి ఎవరితోనూ మాట్లాడని మహాయోగిగా భానుమూర్తి మారిపోవడం చాల ఆశ్చర్యంగా వుంది! 'కడుపు తీపి', 'మనిషి' కథలు కూడ చల బాగున్నాయి

'ఒకవారం విపరీతం' శీర్షికలో ఫిలాటిక్కుడు గారు ఇచ్చే విపరీతాలు మాకు ఆశ్చర్యాన్ని, బొమ్మలు నవ్వునూ కలిగిస్తున్నాయి

సమయమంతుల సత్యనారాయణ (పిఠాపురం)

## మెదడుకి మేత

2—2—68 తేది పత్రికలోని 'మెదడుకి మేత'లోని 'సీసాలూ—బొద్దెంకలూ' సమస్యకు డాక్టరుగారు సూచించిన 3 సీసాలు 5 బొద్దెంకలూ కాక ఇంకొక జవాబు కూడా ఉంది. 6 సీసాలు 1 బొద్దెంక అయినా కూడా మొత్తం 54 కాళ్ళు సరిపోతాయి $(6\times8)+(1\times6)=54$ అందుకని వారు చెప్పిన కొద్దిపాటి ప్రయత్నం సరిపోదు, కొంచెం గట్టి ప్రయత్నమే చెయ్యాలి ఈ లెక్క చేసేందుకు.

అట్లాగే వారి 'అనుమానపు మొగుళ్ళు' సమస్యలో పడవ 6 సార్లు అవతలి రేవుకి, 5 సార్లు ఇవతలి రేవుకి తిరగవలసి వస్తుందని చెప్పారు. ఇంతకన్న తక్కువ శ్రమతోనే ఆ జంటలు తమ సమస్యను పరిష్కరించుకున్నారేమో అని తోస్తుంది. అది ఎట్లా అంటే ముందర కామేశ్వరరావు—కమల పడవలో ఎక్కి అవతలి రేవుకు చేరుకుంటారు కమలను అక్కడ దిగవిడిచి, కామేశ్వరరావు ఇద్దరికి వస్తాడు రెండోసారి విశ్వనాథం విమలను తీసుకువెళ్ళి అద్దరిని దిగవిడిచి వస్తాడు మూడోసారి రామమూర్తి రాధను విడిచి వస్తాడు నాల్గోసారి కామేశ్వరరావు, విశ్వనాథం వెళ్ళి అవతలి గట్టున ఉన్న భార్యల దగ్గర చేస్తారు. ఇంతలో వాళ్ళాయనకు అనుమానపు జబ్బు అని తెలిసిన రాధ, అక్కడ ఉండక, ఆ పడవలో గబగబా ఇవతలి గట్టుకు వచ్చి వాళ్ళ ఆయన్ని తీసుకుపోతుంది. ఇట్లా 5 సార్లు అవతలి రేవుకి, 4 సార్లు ఇవతలి రేవుకి మాత్రమే పడవ తిప్పి, అందరూ చీకటి పడకముందు ఇంటికి చేరుకుంటారు

ఇంతకీ ఆ మొగవాళ్ళకు మాత్రమే అనుమానపు జబ్బు అంటే నేను నమ్మను ఆడవాళ్ళకు కూడా ఈ జబ్బు ఉందనుకుందాం ఉంటుంది కూడాను. అప్పుడు ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? వాళ్ళు ఈ సమస్యతో తికమకలై తెల్లవారే వరకు పడవలోనే తిరుగుతున్నారనుకుంటారేమో వాళ్ళందరు తెలివిగలవాళ్ళే ట్రిప్పుల సంఖ్య పెరగకుండానే వాళ్ళు అవతలి గట్టుకు చేరారు

టి. కె ఎస్ మూర్తి (బొంబాయి)

* * *

ఈ వారం (2—2—68) పత్రికలో వెలువడిన డాక్టరు మహీధర నళినీమోహన్‌గారి 'మెదడుకి మేత' (చ)కు జవాబులో 'రేవు దాటడానికి 6 సార్లు అవతల రేవుకి, 5 సార్లు ఇవతల రేవుకి పడవ తిరుగవలసి వచ్చింది' అని అన్నది

ఈ సమస్యలో రేవు దాటడానికి 5 సార్లు అవతలి రేవుకి, 4 సార్లు ఇవతల రేవుకి పడవ తిరిగినట్లయితే సరిపోవచ్చు ననుకొంటున్నాను

ఎలా గంటే—

ముందర కామేశ్వరరావు, కమల పడవలో ఎక్కి అవతలి రేవు చేరుకుంటారు. కమలను అద్దరిని దిగవిడచి, కామేశ్వరరవు ఇద్దరికి వస్తాడు

రెండవసారి విమల, రాధ కలసి రేవు దాటుతారు. అప్పటికి అద్దరిని ఉన్న కమల పడవ ఎక్కి ఇవతలి రేవుకు వస్తుంది.

మూడవసారి కామేశ్వరరావు, కమల కలసి అద్దరికి వెడతారు కమలను అచ్చట వదలి కామేశ్వరరావు ఇవతలి రేవుకు వచ్చేస్తాడు.

నాల్గవసారి విశ్వనాథం, రామమూర్తి కలసి అద్దరికి చేరుకుంటారు. ఆ పడవ ఎక్కి, కమల ఇవతలికి వచ్చి, ఇద్దరిని ఉన్న తన ప్రాణనాథుడు కామేశ్వరరావును చేరుకుంటుంది. అవతలి రేవులో విశ్వనాథం, విమల, రామమూర్తి—రాధ ఉన్నారన్నమాట.

ఐదవసారి ఇద్దరిని ఉన్న కామేశ్వరరావు, కమల పడవ ఎక్కి అద్దరికి చేరుకుంటారు

ఈ విధంగా 5 సార్లు అవతలి రేవుకి, 4 సార్లు ఇవతలి రేవుక పడవ తిరుగుట ద్వారా ఈ సమస్య


Statement about ownership and other particulars about newspaper

ANDHRA SACHITRA VARA PATRIKA

1. Place of publication Madras
2. Periodicity of it publication: Every Friday
3. Printer's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address 6&7, Thambu Chetty Street, Madras-1.
4. Publishers Name Sri S. Radhakrishna
   Nationality. Indian
   Address: (As above)
5. Editor's Name Sri S. Sambhu Prasad
   Nationality Indian
   Address: 2A Greenways Road Madras-28
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 2A, Greenways Road, Madras-28. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

17-2-68 S. RADHAKRISHNA, Signature of Publisher


శభాష్! విఠలాచార్యా!
అని మెచ్చుకుంటున్న చిత్రం!
కుటుంబ సమేతంగా
చూడండి!
శ్రీ లక్ష్మీనారాయణ ప్రొడక్షన్స్ సమర్పించు
చిక్కడు దొరకడు
దర్శకత్వం బి. విఠలాచార్య
నిర్మాతలు: పోట్లూరి వెంకటనారాయణరావు, కుదరవల్లి సీతారామస్వామి
ఆంధ్రా రాయల
సీడెడ్: జయలక్ష్మి
నైజాం: దివ్యదత్తా
మైసూర్: మాదేశ్వర్
VIJAYA

తెలిష్కారిమువుతుం దనుకొంటున్నాను. ఏ విధ యోమూ పత్రికా ముఖమున తెలుపగలరు.

కె. ఆర్. కె. ఆంజనేయురెడ్డి (నర్సాపురము)

## రచయిత జవాబు

2—2—68వ తేది ఆంధ్ర సచిత్రవారపత్రికలోని మెదడుకి మేత వ్యాసంలోని సమస్యలను పూర్వ పక్షం చేస్తూ నాకు రెండు ఉత్తరాలు వచ్చాయి. ఒకటి బొంబాయి నుంచి సైంటిఫిక్ ఆఫీసరుగా పని చేస్తున్న టి. కె. ఎస్. మూర్తిగారు వ్రాసినది, మరొకటి నర్సాపురం నుంచి ఆంజనేయ రెడ్డిగారు వ్రాసినదీనూ.

"సెలీశ్నా—బొద్దింకలూ" అనే సమస్యకు నేను ఇచ్చిన 3 సాలీళ్ళూ 5 బొద్దింకలూ అనే జవాబు ఒక్కటే కాక 6 సాలీళ్ళూ 1 బొద్దింక అనే జవాబు కూడా సరిపోతుందనీ, ఆ రెండింటిలో ఏ సమాధానం సరియైనదో తెలుసుకునే సాధనం లేదు కనుక ఆ సమస్య అసమగ్రం అనీ శ్రీ మూర్తిగారి వాదం. కేవలం గణిత సూత్రాలనే అనుసరిస్తే వారు చెప్పినట్లు నా సమస్య అసమగ్రం అని ఒప్పుకోవాలి కాని, మెదడుకి మేత సమస్యల్లో కేవలం గణితమే కాక, మాటలలోనూ అక్షరాలలోనూ కూడా గారడీలు, గమ్మత్తులూ ఉన్నాయి. అందుకనే ఇది మెదడుకి మేత అయింది లేకుంటే కేవలం లెక్కల పుస్తకమే అవును, నేను వ్రాసిన సమస్యను మరోసారి చదివితే "కొన్ని సాలీళ్ళూ, కొన్ని బొద్దింకలూ కాపురం ఉంటున్నాయి" అని ఉంది. కొన్ని అనే మాటకు "అనేకం" లేదా "ఒకటి కన్నా ఎక్కువ" అనే అర్థం చెప్పుకోవచ్చును గదా! కనుక, సాలీళ్ళు, బొద్దింకలూ ఒకటి కన్నా ఎక్కువ సంఖ్యలో ఉన్నాయని సమస్యలో భోగట్టా (ఇన్‌ఫర్మేషన్) తెలుపబోతేము. కనుక, వారు చెప్పిన 6 సాలీళ్ళు 1 బొద్దింక అనే సమాధానం సరిపోదు కదా? కనుక, నేను వ్రాసిన "3 సాలీళ్ళూ 5 బొద్దింకలు" అనే సమాధానం ఒక్కటే సరియైనది. అవునా? నేను వ్రాసిన సమస్యలో గుప్తమైన మెలిక ఉంది. సహృదయులు గ్రహిస్తారని ఆశిస్తున్నాను.

ఇంక రెండవ ఆక్షేపణ: ముగ్గురు భార్యలూ, ముగ్గురు అనుమానపు మొగుళ్ళూ రేవు దాటడం సమస్య. ఇందులో కూడా మూర్తిగారు పొరబడ్డారనే చెప్పాలి. మొదటసారి కమలను అద్దరిని దిగవిడిచి కామేశ్వరరావు తిరిగివస్తాడు సరే. రెండవ సారి విమల, విశ్వనాథం పడవ తోసుకుని అద్దరికి వెడితే సమస్యకు భంగం కలిగింది! అద్దరిని విశ్వనాథం ఉన్న చోట తన భార్య కమల ఉండడం ఇద్దరినున్న కామేశ్వరరావు లాంటి పురుష సింహం సహించగలదా? కనుక సమస్యకు వారిచ్చిన సమాధానం కుదరదు. రెడ్డిగారు వ్రాసిన ఉత్తరం చూస్తే వారు కూడా ఇదే విధంగా పొరబడ్డారని తెలుస్తోంది.

అద్దరిని విమల, రాధ ఉన్నారు కదా? అప్పుడు కామేశ్వరరావు, కమల పడవ తోసుకుని అద్దరికి వెడితే నియమ భంగం అయిపోదూ? విమల, రాధల భర్తలు ఇద్దరిని ఉండగా కామేశ్వరరావు అద్దరిని తమ భార్యలతో కలిసి ఉండడం విశ్వనాథం, రమణమూర్తులకు మింగుడు పడుతుందా? కనుక వారిచ్చిన సమాధానమున్నూ సరిపోదు.

సమస్యలోని నియమాలను మరోసారి జాగ్రత్తగా పరిశీలించవలసిందని మనవి. పాఠకులు ఒక చిన్న పొరపాటు చేసినట్లు కనిపిస్తోంది. మామూలుగా ఎంత అనుమానపు మొగుడు అయినప్పటికీ పరాయి పురుషుడితో తన భార్య ఏకాంతంగా ఉంటేనే గోల పెడతాడుగానీ, తన భార్యతో కూడా మరి కొందరు ఆడవాళ్ళున్నా, సదరు పరాయి మగవాడితో బాటు వాడి భార్య కూడా అక్కడే ఉన్నా భయపడడు. భార్యతో కలిసి ఉన్న మగవాడు సాధు జంతువు అని లోకంలో నమ్మిక, మగనిలోని దౌష్ట్యానికి ఆ భార్యామణి అడ్డుగట్టు వేస్తుందనీ, అదే తమకు శ్రీరామరక్ష అనీ అనుకుంటారు. అనుమానపు మొగుళ్ళు, కాని, ఈ సమస్యలోని మగవాళ్ళు మరో ఆకు ఎక్కువ చదివేరు. తన భార్య తానున్న చోట ఉండాలి లేదా ఒంటరిగా ఉండాలి. లేదా ఇతర ఆడవాళ్ళతో (మాత్రమే) కలిసి ఉండాలి. అంతేగాని, తాను లేనప్పుడు తన భార్య మరొక మగవాడు ఉన్నచోట (అక్కడ ఆ పరాయి మగవాడి భార్య ఉండనీ, ఉండకపోనీ, మరి కొంత మంది స్త్రీలు కూడా ఉన్నాసరే) ఉండడానికి వీలులేదు. అదిగో, అదీ సమస్య. ఇప్పుడు ఆ సమస్యకి నేను వ్రాసిన సమాధానంతో ఏకీభవిస్తారనుకుంటాను.

నా సమస్యలు చదివి, స్వయంగా సాల్వ్ చేయడానికి ప్రయత్నించి, తమ సందేహాలనూ అభిప్రాయాలనూ తెలియబరచ గలనేటంతటి ఆసక్తిని పాఠకులలో నా వ్యాసాలు పురికొల్పేయంటే నాకు చాలా సంతోషంగా ఉంది.

మహీధర నళినీమోహన్ (ఢిల్లీ)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 1—3—'68
శ్రీప్లవంగనామ సం॥ ఫాల్గుణమా॥ శుద్ధ విదియ
సంపుటము : 60 సంచిక : 26

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'పూలరంగడు'లో జమున.

కథలు :



సీరియల్ నవలలు :



శీర్షికలు, వ్యాసాలు, సినిమా :

# రాష్ట్రపతి ప్రసంగం: కొన్ని సందేహాలు

రాష్ట్రపతి శాసనసభ ప్రసంగాన్ని ప్రతి ఏడూ ప్రధానమంత్రి కార్యదర్శులు రాసిపెడతారు. డా. జకీర్ హుస్సేయిన్ రెండు సభలవారిముందూ చదివిన ఉపన్యాసం చాలా చప్పగా ఉంది. ఇంత పేలవమయిన ఉపన్యాసం ప్రధానమంత్రి కార్యదర్శివర్గంవారు తయారు చెయ్యలేదేమో అనిపిస్తుంది.

బ్రిటిషు పద్ధతిని అనుసరించి ప్రధానమంత్రి కార్యదర్శివర్గం వివిధ మంత్రివర్గాలవారి సూచనలకోసం అడిగి వాటిని రాష్ట్రపతి ఉపన్యాసంలో ఇముడుస్తారు. వీటిని తగువిధంగా 'పరిష్కరించి' ఒక ఉపన్యాసంగా తయారు చేస్తారు. ఈ ఏడు మాత్రం అతుకులు బాగా కనిపించాయి.

భాషా సమస్యని గురించి రాష్ట్రపతిని ఇలా అనేట్లు చేశారు—'దేశంలో కొన్ని చోట్ల భాషాసమస్య విషయమయి చట్టవిరుద్ధమయిన సంఘటనలు జరగటం శోచనీయం అని ఈ ప్రభుత్వం అభిప్రాయం. దేశంలోని ఐకమత్యాన్ని పెంపొందించి, ప్రజలలో సమైక్యతని పెంచి, అన్ని వర్గాల ప్రజలకీ తమ అభిప్రాయాలని తెలియచేసే అవకాశం కల్పించి, సాంస్కృతికాభివృద్ధిని అధికం చెయ్యటమే ఈ ప్రభుత్వం యొక్క ముఖ్యోద్దేశం. భాషాసమస్యని గురించిన వివిధ వివాదాలు ఇంతటితో అంతమవుతాయని ఈ ప్రభుత్వం ఆశ. భాషావిధానం అమలుపరిచేటప్పుడు వచ్చే ఇబ్బందులని సానుభూతితో ఇచ్చిపుచ్చుకోవాలనే ఉద్దేశంతో ప్రవర్తించటం అవసరం.'

## చట్టంలో మార్పు

భాషాతీర్మానం, చట్టంలో మార్పు అవసరం అని ప్రధానమంత్రి కూడా వప్పుకున్నారు. అంతే కాక, 'హిందీవర్గం'వారు ఎంతమాత్రం సానుభూతి, ఇచ్చిపుచ్చుకునే ధోరణి చూపించారు? ప్రతి భారతీయుడూ హిందీ నేర్చుకొనకపోతే రాజ్యాంగం ప్రకారం దొరికే హోదాలని కొన్నిటిని వదులుకోవాలని కదా వారి వాదన? ఒక మహమ్మదీయుడు మాత్రం లేచి తన మతంవారికి న్యాయం జరిగేట్లు చూడమని రాష్ట్రపతిని కోరాడు.

ఉపప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి ఇంజనీర్లతో, 'మీరు ఇంగ్లీష్ కావాలనరా'దన్నారు. ఆయన ఇప్పటికే గుజరాతు విశ్వవిద్యాలయంలోని విద్యార్థులు 'ఇంగ్లీషు యూనివర్సిటీ'ల వారికన్నా తక్కువ అయేట్లు చేశారు. శ్రీ దేశాయి మార్గం అవలంబిస్తే భారతదేశానికి టెక్నాలజీ, శాస్త్రాలు, వైద్యం- వీటిలో అభివృద్ధి ఉండదు. శ్రీయుతులు దేశాయి, మధూలి మాయీ, సేట్ గోవిందదాస్‌ల వంటి వారు తమ విధానాల వల్ల ఎందరు విద్యార్థుల జీవితాలతో చెలగాటాలు ఆడుతున్నారో గ్రహించారా? 1967లో విద్యార్థులు ఎన్ని రోజులు పాఠశాలలని మానుకోలేదు? 1945 మెట్రిక్యులేషన్ పట్టభద్రుడు నేటి బి. ఎ. తో సమానం అంటే విద్యాప్రమాణాలు ఎంత పడిపోయాయో తెలుసుకోవచ్చు. హిందీ విషయంలోనూ ఈ తిరోగమనాన్ని గమనించవచ్చు. 'హిందీ డాక్టర్లు, హిందీ ఇంజనీర్లు' వీరి సంగతి ఏమికావాలి? వివిధ శాస్త్ర పరిశోధనల ఫలితాలని తెలిపే పత్రికల హిందీ అనువాదాలు లభ్యమయ్యే ఏర్పాట్లు శ్రీ దేశాయి చేశారా? మద్యపాన నిషేధం వల్ల ఎంతో నష్టం కలిగింది కాని మద్యపానాభిలాష మాత్రం తగ్గలేదు. శ్రీ దేశాయి వంటి తీవ్రవాదుల ధర్మమా అంటూ వారు టించర్లు తాగి చనిపోతున్నారు కూడా.



భారతీయ జనసంఘ్ నూతన అధ్యక్షుడు
శ్రీ అటల్ బిహారీ వాజ్‌పాయ్

ఇతర దేశాలని గురించి చదవక పోవటం హిందీవాదుల ప్రత్యేక బలం. భాషా యుద్ధాలలోకి దిగిన మరొక దేశం బెల్జియమ్.

'కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సానుభూతి, సహకారం ఉంటే దేశానికే మంచిది. పార్టీ విచక్షణ లేకుండా సహకరిస్తామని వారు అంటున్నారు. అలాగే రాష్ట్ర ప్రభుత్వాల సహకారం కోసం వారు ఎదురు చూస్తున్నారు,' అన్నారు రాష్ట్రపతి.

## కాంగ్రెసు తీర్మానం

ఇది కష్టంతో కూడిన కాలం. హైదరాబాదు తీర్మానంతో కాంగ్రెసు కాంగ్రెసువికాని ప్రభుత్వాలని పడగొట్టటానికి నిశ్చయించుకున్నది. పశ్చిమ బెంగాలు ప్రభుత్వం పడిపోయింది; బీహారు కూడా అంతే; ఇక ఉ. ప్ర.లో శ్రీయుతులు సి. బి. గుప్త, త్రిపాఠీలు వారి రాష్ట్రంలోని ప్రభుత్వంతో ముసుగులో గుద్దులాట ప్రారంభించారు. హర్యానాలో రాష్ట్రపతి పాలన ఉంది. పంజాబులో నిలకడ లేదు. ఉపప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి కాంగ్రెసువారు ఇతర పార్టీల ప్రభుత్వాల మీద చేసే యుద్ధాన్ని బహిరంగంగా బలపరుస్తున్నారు.

ఒక ప్రశ్న వెయ్యటం అవసరం. రాష్ట్రపతి కేవలం ఉపన్యాసాలు చెప్పే ఆభరణమా, లేక స్వంతంగా నిర్ణయం తీసుకోగల శక్తి కలవాడా? ఆయన కాంగ్రెసు నియమించిన వ్యక్తి. నిజమే, కాని ఎన్నిక అయిన తరువాత ఆయన ఏ పార్టీకి చెందడు కదా? అవసరం అయితే ఆయన తనకి తానుగా నిర్ణయాలకి రావాలి కదా?

* * *

కొత్త ఢిల్లీలో జరిగిన 'అంక్టాడ్' (ఐక్యరాజ్యసమితి వ్యాపారం, అభివృద్ధి కోసం ఏర్పరచిన) సమావేశంలో చిన్న ప్రచ్ఛన్న యుద్ధం ఒకటి జరిగింది. రష్యా బల్గేరియాల ప్రతినిధులు వియత్నాం యుద్ధాన్ని ఖండించారు. సమావేశంలో తూర్పు జర్మనీకి ప్రాతినిధ్యం కావాలన్నారు. కమ్యూనిస్టులు ఇవ్వగలిగినదేమీలేదు కనుక వారి ప్రభావం అంతగా తెలియలేదు. అంతేకాక, వారు ఇస్తానన్నది ఏమీలేదు, తమ జాతీయాదాయంలో ఒక్క శాతం దానం చెయ్యటానికి పూనుకోలేదు. అభివృద్ధి చెందుతున్న దేశాలవారి భుజాలమీద ఎక్కి అభివృద్ధి చెందిన దేశాలలోని వ్యాపారపు ఏర్పాట్లు నాశనం చెయ్యాలని వారి ఉపాయం అని తోస్తుంది. రష్యా ప్రతినిధివర్గం నాయకుడు శ్రీ పటోలిచేవ్ ఇలా అన్నారు:

'పాశ్చాత్య దేశాలు సోషలిస్టు దేశాల నుంచి దిగుమతుల విషయమయి నిర్బంధాలు రద్దు చెయ్యాలి; సోషలిస్టు దేశాలకి పంపే ఎగుమతులని గురించి నిర్బంధాలు ఉండనివ్వరాదు; తూర్పు, పడమర దేశాలు ప్రత్యేకాభిమానంతో వ్యాపారాలు చేసుకోవాలి.

'కోకో, పంచదార, బీన్స్, నూనె విత్తులు, నూనె, పత్తి, నారింజ, అరటి కాయలు, సీసం, జింకు, రాతినూనె, రాగి — వీటి ధరల నిలకడ విషయమయి వప్పందం కుదరాలి. ఇనుము, మాంగనీసు ధాతువులు, గట్టి దారాల విషయంలోనూ వప్పందం కుదరాలి.

'సోషలిస్టు దేశాలతో వ్యాపారపు వప్పందాలు పెట్టుబడిదారు దేశాలతో చేసుకునే వప్పందాలతో సమానంగా ఉండాలి.'

## రష్యా విధానం?

భారతదేశం, ఈజిప్టు దేశాలలో వారు సాధించిన వాటినిగురించి చెప్పటం మినహాయించి రష్యా ప్రతినిధి తన దేశం దిగుమతి విధానాన్ని ఏ విధంగా సడలిస్తుందో చెప్పలేదు—వెనుకబడిన దేశాలనుంచి అయినా సరే. రష్యా, చెకోస్లవాకియాలు భారతదేశంలో తయారయిన వస్తువులని కొంటామన్నాయి, నిజమే. (ప్రత్యేకంగా తమ సహాయంతో నెలకొల్పిన కర్మాగారాల నుంచి.) కాని, ధర విషయం ఏమిటి? వారి దేశాల్లో 'బజారు-వ్యవస్థ' లేదు. అమ్మే సంస్థ ఒక్కటే— ప్రభుత్వం. ఇక భారతదేశంలో తయారయిన వస్తువులకి మాత్రం బేరం ఉంటుంది. మన వస్తువులు కొన్నప్పుడు వారు బదులుగా తమ వస్తువులు ఇస్తారు. కమ్యూనిస్టు రాజ్యాల ప్రభుత్వాలు స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్‌తో వ్యాపారం చెయ్యటానికి ఇష్టపడరన్న సంగతి అందరికీ తెలును.

'అభివృద్ధి విధానం రాజకీయ-ఆర్థిక పరిస్థితిని బట్టి జరగాలి కాని 'రాజకీయం-పురాణం' బట్టి కాదు,' అన్నారు జర్మన్ ప్రతినిధి డా. కార్ల్ షిల్లర్. 'అభివృద్ధి చెందిన దేశాలు సహాయం చేసినప్పుడు సహాయం పొందిన దేశాలు తగినట్లు తమ ఆర్థిక విధానాలని మార్చుకోవాలి.'

# శ్రీ దీనదయాళ్ ఉపాధ్యాయ మృతి

భారతీయ జనసంఘ్ అధ్యక్షుడు శ్రీ దీనదయాళ్ ఉపాధ్యాయ లక్నో నుంచి పాట్నా వెళ్తూండగా దుర్మరణం పాలైనారు. లక్నో నించి వస్తున్న ఎక్స్‌ప్రెస్ ఫిబ్రవరి 11వ తేదీ తెల్లవారు జామున వారణాసికి 14 మైళ్ల దూరంలో ఉన్న మొఘల్‌సరాయి స్టేషన్‌కి చేరినప్పుడు ఆయన భౌతిక కాయాన్ని కనుగొనటం జరిగింది.

శ్రీ ఉపాధ్యాయ పార్టీ కార్యకర్త మొదలు కొని భారతీయ జనసంఘ్ అధ్యక్షుని వరకూ గల వివిధ బాధ్యతాయుతమైన స్థానాలతో ప్రముఖ పాత్రలని నిర్వహించారు.

శ్రీ ఉపాధ్యాయ 1917 అక్టోబర్ 10వ తేదీన మధుర జిల్లాలో జన్మించారు. జయపూర్, కాన్పూర్, అలహాబాద్‌లలో విద్యాభ్యాసం చేశారు. ఆయన పెద్ద రాజకీయవేత్తే కాక మంచి రచయిత కూడా. 'పాంచజన్య', 'స్వదేశ్', 'రాష్ట్రధర్మ' వంటి వివిధ జాతీయ ప్రచురణలలో చురుకైన పాత్రలని నిర్వహించారు. శ్రీ ఉపాధ్యాయ మరణ భారత రాజకీయ రంగానికే తీరని లోటు కలిగించింది. ప్రముఖ రాజకీయ వేత్తలు, పలువురు ప్రముఖులు శ్రీ ఉపాధ్యాయ మృతికి తమ గాఢ సంతాపానుభూతులని వ్యక్తం చేశారు.



# శ్రీ శే. కార్మాలి ఆత్మహత్యా రహస్యం

'సానే గురూజీ ఆత్మహత్య చేసుకున్నారు' అన్నవార్త మహారాష్ట్ర ప్రాంతాన్ని విచార సముద్రంలో ముంచి వేసింది. ఇది 1950 లో సంఘటన.

సానే గురుజీ మహాత్మాగాంధీ శిష్యకోటి లోనివాడు. 1930 నుంచి అతను కాంగ్రెస్ ఉద్యమంలో తీవ్రకృషి సల్పినవాడే. అనేక సార్లు జైలుకు వెళ్ళాడు. 1940 లో కాంగ్రెసు విధానాలు నచ్చక ప్రజాసోషలిస్టు పార్టీలో చేరాడు. అతను ఆదర్శభావాలతో వున్న రాజకీయ నాయకుడే కాకుండా, చక్కని రచయిత. యువకుల హృదయాలను దేశ భక్తితో నింపడానికి చాలా గ్రంథాలు రాశారు. యువకులకు ఆయన ఆరాధ్యదైవంగా వుండేవారు. అంతటి మహావ్యక్తి ఆత్మహత్య చేసుకున్నాడు! యాభయ్యవ ప్రాయంలో ఆత్మహత్యకు దారితీసిన దారుణ పరిస్థితులు జీవితంలో అసంతృప్తి తప్పితే వేరే ఏమీ కారణం కాదని తెలిసింది

బొంబాయిలో ఆయన భౌతిక కాయానికి దహన సంస్కారాలు జరిగాయి. సంతాపకరమైన సానే గురూజీ చివరి ఘట్టాన్ని చూడడానికి ఎంతోమంది ప్రజలు హాజరయ్యారు. దహనక్రియకాగానే విచార భారంతో కృంగిపోతూ ఆ స్థలాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోతున్నప్పుడు వారికి ఒక విచిత్రమైన సంఘటన ఎదురయింది.

పదిహేడేళ్ల కుర్రవాడొకడు పూర్తిగా కాలిపోయిన చితికి సమీపంగా కూర్చుని వెక్కివెక్కి ఏడవడం వాళ్ళు చూశారు. అడిగిచూస్తే, ఆ కుర్రవాడు సానే గురూజీని చూడడానికి గోవానుంచి బొంబాయి వచ్చాడని తెలిసింది. అతను వచ్చిన రోజునే సానే గురూజీ మరణించడం జరిగింది!

ఆ కుర్రవాడే వి యస్ కార్మాలి సానే గురూజీ మరణించిన పదిహేడేళ్ల తర్వాత 1967 లో వి యస్ కార్మాలి ఆత్మహత్య చేసుకున్నారు! అప్పుడు అతను గోవాకి విద్యామంత్రిగా కూడా పనిచేసి వున్నాడు. సానే గురూజీ ఆత్మహత్యని కళ్ళారా చూసిన కార్మాలి పదిహేడేళ్ల తర్వాత తనుకూడా ఆత్మహత్య చేసుకోవడం ఒక విచిత్రం!

కార్మాలి గ్రాడ్యుయేషన్ పూర్తిచేసిన తర్వాత బొంబాయి స్టేట్ ట్రాన్స్‌పోర్ట్‌లో గుమాస్తాగా పని చేసేవాడు. తర్వాత గోవాకి వచ్చి అక్కడ ఒక పారిశ్రామిక సంస్థలో పని చేశాడు. గోవాకి స్వాతంత్ర్యంవచ్చినతోడనే కాంగ్రెసులో చేరాడు. 'మహారాష్ట్రవాది గోమన్‌టక్ పార్టీ' వ్యాప్తిలోకి వచ్చినతర్వాత గోవా కాంగ్రెసును విడిచి అందులో చేరి, బండోడ్కర్ మంత్రివర్గంలో ఒక స్థానాన్ని ఆక్రమించుకున్నారు. బండోడ్కర్‌కి అతను కుడిభుజంగా పనిచేశాడు. గోవాలో ద్వితీయ సార్వత్రిక ఎన్నికలు వచ్చినప్పుడు కార్మాలి రాజకీయపతనం ఆరంభమయింది. అతను ఎన్నికల్లో నెగ్గినా బండోడ్కర్ మంత్రివర్గంలో స్థానం సంపాదించుకోలేకపోయాడు!

కొద్దినెలల తరువాత బొంబాయి వచ్చి, సెప్టెంబరు ఒకటవతేదీన ముఖ్యమంత్రి శ్రీ వి. పి. నాయక్‌తో మాట్లాడి, యమ్మెల్యే క్వార్టర్సుకు వెళ్ళారు. మర్నాడు అంటే—1967 సెప్టెంబరు రెండవ తేదీన ఆత్మహత్య చేసుకున్నారు. ఆయన ఆత్మహత్య చేసుకునేముందు ఒక ఉత్తరాన్ని రాశారు. ఆ వుత్తరాన్ని అన్ని వార్తాపత్రికల్లోను ప్రచురించాలని అభ్యర్థిస్తూ రాశారు. పత్రికలు ప్రచురించడానికి సిద్ధంగా వున్నా, ప్రభుత్వం వాటిని పత్రికలకి అందజేయడానికి రెండునెలలు పట్టింది.

వార్తాపత్రికల్లో ప్రచురించిన ఈ ఉత్తరం కార్మాలి ఆత్మహత్యా రహస్యాన్ని భేదించింది. 'పదవిలో ఉన్నంతకాలం ఎటువంటి ఆక్షేపణలు లేకుండా ఆదర్శంగా నిలబడాలని ఆశయంగా పెట్టుకున్నాను. నిస్వార్థంగాను నిష్పక్షపాతంగాను వ్యవహరించినందుకు స్వంతపార్టీలోనే శత్రువులు ఎక్కువయ్యారు. నావల్ల ఏదో ఉపకారాన్ని పొందుదామని వచ్చినవారికి నేను నిష్కర్షగాను, ప్రజాశ్రేయస్సుతోను సమాధానం ఇవ్వవలసి వచ్చేది. అంతేకాకుండా నా సాటివారి అన్యాయార్జితాన్ని ఖండిస్తూ వుండడంవల్ల వారు శత్రుత్వాన్ని పెంచుకున్నారు. అందువల్ల బండోడ్కర్ మనసు విరిగి పోవడంతో మంత్రివర్గంలో రెండవసారి నేను నెట్టివేయబడ్డాను.' అన్న సారాంశం ఆ వుత్తరంలో వుంది.

'రాజకీయ జీవితంలో జరిగిన ఈ అవమానమే జీవితంలో అసంతృప్తిని రెచ్చగొట్టిందని, అదే ఆత్మహత్యకిపురికొల్పిందని' కార్మాలీ ఆ వుత్తరంలో నొక్కిచెప్పారు!

ఆదర్శవంతమైన జీవితం గడపాలనుకున్న శ్రీ కార్మాలీ దుర్మరణం జాతికి గొడ్డలిపెట్టు!



మీ దగ్గరలో వున్న బుక్ షాపులో
గాని, దినపత్రికలమ్మే న్యూస్
ఏజంటుని గాని అడగండి.
లేవంటే తెప్పించిపెట్టమనండి
అదీ కాదంటే మాకు రాయండి
పాఠకులు ఇలా నాలుగూ ఒక్కసారి తెప్పిస్తే
పోస్టేజి ఉచితం సొమ్ము పూర్తిగా ముందే
మనియార్డరు కట్టాలి. విడివిడిగా కావాలంటే
ఒకో ప్రతికి పావలా పోస్టేజి అదనం
ఇదీ పుస్తకం ఖరీదూ ముందుగా
మనియార్డరు పంపాలి. రిజిస్టరు పోస్టయితే
పాకెట్‌కి 60 పైసలు అదనం.




# ఎమెస్కో పాకెట్ బుక్స్
## మార్చి విడుదలలు!



**వక్రగతులు**
ఇతర కథలు
మధురాంతకం రాజారాం
రు. 2/-

**గిరీశం ది గ్రేట్**
**సెకండ్ స్పెల్**
సుప్రసిద్ధ సినీమాటల
వడ్లమన్నాటి
కుటుంబరావు
హాస్య వ్యంగ్య రచన
రు. 2/-

**సామాన్యుడి కామన**
మాలశ్రీ
ఉన్నట్టుండి వెలుగులో
పడ్డ సామాన్యుడి కొచ్చిన
చిక్కుల్ని చూపించే
సాంఘిక నవల
రు. 2/-

**ప్రాణాంతక**
**ప్రణయం**
వి. యస్. అవధాని
చిత్రాంగికి సారంగధరునికీ
మధ్య ప్రణయబాటే జరిగి
ఉంటే పర్యవసానం ఇలాగే
వుండేదేమో!

## పుస్తక విక్రేతలకు ఆకర్షణీయమైన టరమ్స్! వివరాలకు నేడే రాయండి.

ఇంతవరకూ విడుదలైన ఎమెస్కో పాకెట్ బుక్స్:

1 దిండుక్రింద పోకచెక్క * విశ్వనాథ సత్యనారాయణ
2 బ్రతికిన కాలేజీ * పాలగుమ్మి పద్మరాజు
3 గ్రహణం విడిచింది * ద్వివేదుల విశాలాక్షి
4 సాక్షి * ముళ్ళపూడి వెంకటరమణ
5 విచిత్రనేళీయం * చలం
6 పిడికెడు ఆకాశం * గొల్లపూడి మారుతీరావు
7 హౌస్ సర్జన్ * కొమ్మూరి వేణుగోపాలరావు
8 నిరీక్షణ * ఉన్నవ విజయలక్ష్మి
9. కాశ్మీర పట్టమహిషి * పిలకా గణపతి శాస్త్రి
10 ఆత్మబలి * సి. ఆనందారామం
11. సుఖం కోసం * వీరాజీ
12. బంధము, అనుబంధము * పి.వి. కృష్ణమూర్తి
13 స్వీట్ హోమ్ * ముప్పాళ రంగనాయకమ్మ
14 నూరు శరత్తులు * మంజుశ్రీ
15 కోనేరు-సెలయేరు * వాసమూర్తి
16 ఇదే దారి * బలివాడ కాంతారావు
17 బుద్ధుని జాతక కథలు * శ్రీ శివశంకర స్వామి
18. అహం-అనర్థం * ముద్దంశెట్టి హనుమంతరావు
19 స్వయంవరణం * మహీధర రామమోహనరావు
20 అదృష్టచక్రం * హరికిషన్

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
## రాష్ట్రపతి రోడ్. సికింద్రాబాద్

# నలుగురు పిల్లలని హత్యచేసిన నరరూప రాక్షసి

మారిగా (కొచ్చిన్) అనేచోట 37 ఏళ్ల లూసీ అనే ఆవిడ ఓ పెద్ద చేతిసంచితో చర్చి (వర్చకాదు)కి వెళ్ళిందట. చనిపోయిన వారికి సంతాపం ఏర్పాటు చేయమని వికార్ (ఒక వుద్యోగి)ని అడిగి, దాని కోసం డబ్బు తీయబోయిందట. ఈ పెద్ద సంచి దలా బరువు వుండడం వల్ల అనుమానంతో వికార్ దానిని ఆమె చేత తెరిపించి చూస్తే అందులో 18 నెలల పసిబిడ్డ శవం వుందట. ఆ పసిగుడ్డు ఆమె బిడ్డేనట.

ఈ విషయం వికార్ పోలీసులకు తెలియజేశాడట. పోలీసులు ఆమె యింటిని సోదా చేస్తే మరో నాలుగు శవాలు దొరికాయట. ఆమె భర్త జోసఫ్ (రెండో భర్తట) ముగ్గురు పిల్లలు (మొదటి వివాహ సంతానం ఇద్దరు, రెండో వివాహ సంతానం ఒకరు, వీరిని నలుగుర్నీ లూసీయే హత్య చేసిందట. లూసీని పోలీసులు అరెస్టు చేశారట. అసలీ నరరూప రాక్షస కృత్యానికి కారణం ఏమిటో యింకా తెలలేదు.

* * *

భారతీయ జనసంఘ పార్టీ ప్రెసిడెంట శ్రీ దీన దయాళ్ ఉపాధ్యాయ శవం మొగల్‌సారాయ్ రైల్వే స్టేషను సమీపంలో పట్టాల మీద దొరికిందట. ఎవరో కావాలని పథకం వేసి మరీ యీ హత్య చేశారని అధికారవర్గాలు భావిస్తున్నాయి.



## పూలమొక్కలను పీకి కూరమొక్కలు

శాసనసభా భవనం ముందున్న పూలమొక్కలనన్నీ పీకి, ఫలవృక్షాలను నాటిన కారణంగ శ్రీ గోరా (నాస్తిక బృందం)ను మరో 15 మందినీ అరెస్టు చేశారట (11 తేది). పోలీసు జులుం ఎంత వారించినా వినక వారు అతి నేర్పుగా పూలమొక్కలన్నీ పీకి పారేసి, టమోటాల వంటి కూరమొక్కలు నాటేశారట!

## జైలే మేలా!

కనీసం రెండుమూడు నెలలకు ఒకవారం, రోజులైనా ఖైదీలు తమ తమ భార్యాపిల్లలతో కాలక్షేపం చేసే అవకాశాన్ని కలుగజేయాలని, అదేగాక ఏవైన పెద్దపండుగలకు, ముఖ్యమైన సందర్భాలకు కూడ ఖైదీలను వదలాలని కేరళ అడ్వకేటు జనరల్ శ్రీ పి. సుబ్రహ్మణ్యం పోర్టి తన



అభిప్రాయాన్ని వెల్లడి చేశారు. చాలా కాలం, జైళ్లల్లో స్త్రీసంపర్కం లేకుండ వుండడం శరీరశాస్త్ర దృష్ట్యా ఆరోగ్యకరం కాదని, జైల్లోంచి బయటకు వచ్చాక అట్టివారు తిరిగి గృహస్థాశ్రమంలో తగిన తృప్తిపొంద లేరనీ ఆయన అన్నారు. భళి! ఈ లెక్కన జైల్లో వుండడమే చాలా ఆరోగ్యంకాదూ!

## రక్తపు మడుగులో గుర్తు తెలీని శవాలు

మీనంబాకం విమానాశ్రయానికి సమీపంలో (యీనెల 11 తేదీన) రెండు శవాలు రక్తపుమడుగులో దొరికాయట. ఒకతనికి 40 ఏళ్ళు, మరొకతనికి సుమారు 30 ఏళ్ళు వుండవచ్చున్నారు. వారి శవాలకు కొంచెం దూరంలో రాయికి కట్టేసిన ఎద్దు కూడా వుందట. ఈ రెండు శవాలూ గుర్తు పట్టలేదట. ఎవరు? ఎందుకు? ఎప్పుడు? ఎలాగ యీ హత్యలు చేశారో తెలియలేదింకా.-

## మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు



న్యాయవాదులకు, నాయ
కాగ్రణులకు
వర్తకులకు దైవభక్తి మెండు
కొంగ జపము మీల
మ్రింగుటకే కదా!
హృదయవర్తి యీ మహీధరోక్తి.

# హెచ్‌యంవి నిప్పర్

టెలిస్కోపిక్ ఏరియల్, అతి సున్నితమైన ట్యూనింగ్ కంట్రోల్ కలిగివున్న అతి చిన్న ఆల్ వేవ్ ట్రాన్సిస్టర్ ఇప్పుడు రు. 245/-* లకు మాత్రమే లభ్యమౌతున్నది.

## చూడ ముచ్చటైనది-
## విన సొంపైనది






**His Master's Voice**

**PUTS QUALITY FIRST**

# ఒకవారం విపరీతం

## ఆత్మహత్య!

29 ఏళ్ళ స్వామీ బనేర్జీ, త్యాగరాయ నగర్లో ఉరితీసుకుని చనిపోయాడట. చూడటం కోసం వస్తున్న యువతి శవాన్ని పోలీసులు స్వాధీనం చేసుకున్నారట. ఈ స్వామీజీ ప్రఖ్యాత తమిళ హాస్యనటుడు శ్రీ నాగేష్ బావమరదట!

* * *

ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు 'నిక్ ఆడమ్స్' మొన్న చనిపోయాడట. ఆయన శవం సొంత యింట్లోనే దొరికిందట. అంత అర్ధాంతరంగా ఎందుకు చని పోయాడో ఆయన! (వయస్సు 34 ఏళ్ళే) హాలీవుడ్ దర్యాప్తులు ప్రారంభమయ్యాయి. బహుశా స్వభావ సిద్ధమైన చావేనని మా అనుమానం అన్నారట ఆశావారు.

* * *

కోయంబత్తూరుకు 50 మైళ్ళ దూరంలో వున్న ఉడుమలపేట తాలూకాకు చెందిన 'ధళ్లి' పోలీసు 'లాకప్' లో వున్న ఒకఖైదీ ఆత్మహత్య చేసుకున్నాడట. దొంగతనాలు విరివిగ చేశాడన్న ఆరోపణతో (మారియప్పన్) ఇతన్ని ఖైదు చేశారట.

## అగ్నిప్రమాదం

కాన్పూరులో 11వ తేదీన జరిగిన అగ్నిప్రమాదం వల్ల ఒక గిడ్డంగి (గోడవున్) లో వున్న కొన్నిలక్షల ఖరీదు చేసే ప్రత్తి భస్మీపటలమై పోయిందట.

## 5.77 కోట్ల ఖరీదు చేసే వాచీల స్వాధీనం

బొంబాయిలో ఒక ప్రయాణీకుడి వద్ద నాలుగో వేల వాచీలు పట్టుకున్నారట. ఇవన్నీ కాగితాల్లో చుట్టి, కొవెనంచాల్లో పెట్టి వున్నాయట. ఈ వాచీల మొత్తం ఖరీదు 14 లక్షలట. నవంబరు 66 నుంచి పట్టుకున్న వాచీల ఖరీదు 5.77 కోట్ల



రూపాయలట! ఈ వాచీలన్నీ కస్టమ్సువారు ఏం చేస్తారో!!

## దొంగ సర్టిఫికెట్లతో ఆర్. ఎం. ఓ. ఉద్యోగం

బొంబాయిలోని నాయర్ హాస్పిటల్లో ఆర్. ఎం. ఓ. గా పనిచేస్తున్న సిలోన్కి చెందిన వ్యక్తి నొకర్ని దొంగ సర్టిఫికెట్లతో ఉద్యోగాన్ని సంపాదించిన నేరానికి అరెస్టు చేశారు. మెడిసన్ చదవకుండానే అతను యిన్నాళ్ళూ తన బాధ్యతల్ని ఎలా నిర్వహించాడో!?

—పాలాక్షుడు ●

## కత్తి - కలం

16 వ శతాబ్దం ముగుస్తోంది. దేవగిరి రాజ్యాన్ని యాదవ వంశంవారు పాలిస్తున్నారు. వారి దివాను అంబాజీ పంత్ లోకప్రసిద్ధి చెందినవాడు, చాలా ధనవంతుడు కూడా. అతని కొక్కసారి కొడుకు పుట్టినప్పుడు అతని సేవకులు ఏనుగుమీద ఎక్కివెళ్ళి ఊళ్ళో వారందరికీ చక్కెర పంచి పెట్టారు! ఈ కొడుకుకి తుకోజీ అని నామకరణం చేశారు. తుకోజీ పంత్ ఎదిగి పెద్దవాడయి 18 వ ఏట తండ్రి పదవి వదులుకున్న తర్వాత యాదవ రాజ్యం దివాను అయిపోయాడు. త్వరలోనే తన అధిపతుల తరఫున యుద్ధాలలో పాల్గొని ఎన్నో విజయాలని సాధించాడు. ఇటువంటి ఒక యుద్ధంలో తుకోజీ పంత్ వోడించిన శత్రువు గత్యంతరం లేక పలాయనం చిత్తగించాడు.

ఆ రోజుల్లో విజేతలు శత్రువుల శిబిరాన్ని దోచుకోవటం పరిపాటి. తుకోజీ శత్రురాజు గుడారాన్ని ప్రవేశించాడు. లోపలికి వెళ్ళిన తుకోజీ ఎన్నో నగలతో బయటికి వస్తాడని ఎదురుచూసిన సైనికులు అతను కేవలం ఒక పుస్తకంతో వెలుపలికి రావటం చూసి ఆశ్చర్యపోయారు. తుకోజీవంతొక్కి ఆ పుస్తకం అంటే ఎంత ఆసక్తిగాని హడావుడిగా గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడు తన గుడారానికి. మరువాడు యాదవ సేనలు తమ రాజధానికి తిరిగి వెళ్ళిపోయాయి. విజయం. దానివల్లవచ్చిన ధనలాభంతో సైనికులు సంతుష్టులయ్యారు. కేవలం పుస్తకలాభం పొందిన తుకోజీ అధిక సంతుష్టుడయ్యాడు.

ఆ రోజుల్లో ముద్రణ ఇంకా ప్రచారంలోకి రాలేదు. తుకోజీ చాలాకాలంగా మరాఠీ వ్యాఖ్యకల భాగవతం ప్రతికోసం వెతుకుతున్నాడు శత్రురాజు గుడారంలోనికి కొల్లగొట్టటానికివెళ్ళిన అతనికి ఆ పుస్తకమే కనిపించింది! అంతేకాక, అది ఏకనాధుడి వ్యాఖ్యకలది! ఈ గ్రంథం తుకోజీ జీవితాన్నే మార్చేసింది. ఇహ సౌఖ్యాలమీద విరక్తి జనింపచేసింది. క్రమంగా అది అధికమయి ఒకనాడు అతను సన్యాసం పుచ్చుకోవటానికి నిశ్చయించుకున్నాడు. సరిగ్గా ఆ సమయంలో తుకోజీకి లక్ష్మణదాసు అనే యోగి పరిచయం అయింది. అతనిద్వారా సన్యాసాశ్రమం స్వీకరించాడు.

తుకోజీ పంత్ రమావల్లభ దాసు అయిపోయాడు. రమావల్లభదాసు తన జీవితశేషాన్ని కృష్ణానదీతీరం మీదవేనున్న వాయీ లో గడిపాడు. అక్కడ ఎన్నో మతగ్రంథాలు రాశాడు. వీటన్నిటిలో పేరు పొందినది శంకరాచార్యుల 'బృహద్ వాక్య వర్తి' మీద ఆయన వ్యాఖ్య 'వాక్యవర్తి'.

— ఎస్


ఇంకా నాల్గు గంటలు
బ్రతుకుతా నన్నారుగా-ఈలోగా
ఓ పిక్చర్ చూసొస్తా డాక్టర్!


సరే! సాయంత్రం పిక్చర్ కి
తీస్కెళ్తా నన్నాగా- ఇక
అన్నం వండవే!


దయవుంచి ఓ సినిమా చూసిం
తర్వాతే ఉరిశిక్ష పడేట్లు
చూడండి!


అబ్బే! అతను కారు కింద పడ్డం లేదండీ!
సినిమా టికెట్ తీసుకురాటానికి
ప్రయత్నించాడు...


బుకింగ్ క్లోజ్ చేశాడుగా
ఇంకా ఎందుకురా
ఇక్కడ?
సెకండ్ షో కి..
1-20


మరి అంత నవ్వాపుకోలేని వాడివి
కామిక్ పిక్చర్ కి
ఎందుకెళ్లావ్?




**వి. ఆర్. ఆర్, కొవ్వూలగుండు**

భగవంతుడు అందరికీ సరైన జ్ఞానము సమానముగా ప్రసాదించ లేమిటండీ?

జ్ఞాన సముపార్జనకు కావలసిన సరుకు అందరి మెదడ్లలోనూ పోసాడు పరవాడు భగవంతుడు. కొందరు దాన్నిపై పొందించుకుందుకు కృషిచేస్తారు. కొందరు బద్ధకిస్తారు. అంతే.

**ఎమ్. ఆర్, రాయచోటి**

కుటుంబ నియంత్రణపై మీ అభిప్రాయం ఏమిటి?

పరిమిత కుటుంబం కావాలనుకున్నవాళ్ళు అవశ్యం అవలంబించ వలసిన విధానానికి ప్రత్యేకమైన అభిప్రాయ ప్రకటన దేనికి సోదరా!

**బి. వి. ఎన్. ఆర్, రూర్కెలా**

తు. చ. తప్పకుండా అంటారు. దీనికి అర్థం ఏమిటి?

సంస్కృతంలో యతిప్రాసల కిట్టింపులకోసం కొన్ని వ్యర్థమైన పదాలు, అక్షరాలు వాడుతూ ఉంటారు. వాటిలో తు. చ.లు కూడ ఉన్నాయి. యథాతథంగ అనువదిస్తూ ఆయా తు. చ.లను కూడా దించడం జరుగుతూ ఉంటుంది. కొంచెంలో చెప్పాలంటే 'మక్కికి మక్కి' అనువదించడాన్ని, అనుసరించడాన్ని అలా అనుకోవచ్చు.

**ఐ. ఎస్. ఎస్. ఎమ్, రాజోలు**

భార్యాభర్తల మధ్య అనురాగాన్ని వేరు చేయునది ఏది?

రహస్యాలు.

**పి. డి. ఆర్, ధవళేశ్వరం**

ఎవరికి ఎవరు కాపలా?

ఎవరికి వారే కాపలా!

**జి. కె. ఆర్, గుంటూరు**

దేనిని విడువడంవల్ల మనిషి అందరికీ మంచివాడు అవుతాడు?

కొంత స్వార్థం. కొంత అహం.

**ఎన్. ఆర్. డి, జగిత్యాల**

ఊహలతో సామ్రాజ్యమేలుతూ జీవితాన్నంతా గడపడం సాధ్యం అవుతుందా?

గానినే భోంచేసి మామైతే— మహారాజులాగా సాధ్యం అవుతుంది సోదరీ.

**ఎస్. ఎన్. ఎస్, హెూస్పేట**

మిమ్మల్ని ఎవరేనా విమర్శించారను కోండి వారిని అభినందిస్తారా?

విమర్శకులని అభినందించక్కరలేదు. వాళ్ళు చెప్పింది వింటే చాలు.

**ఆర్, వి. సిహెచ్, సికింద్రాబాదు**

ఒకమ్మాయి నన్ను ప్రేమించింది. ఆమె మాటల్లో చేతల్లో ఉన్న హాయి రాను రాను ఉండటంలేదు. ఎందువల్ల అలా ఉంటుంది?

బహుశా పెళ్లి చేసుకోమని అడగడం వల్లనేమో తమ్ముడూ!

**టి. పి. బి, విశాఖపట్నం**

అధికారంలో ఉన్నవారికి అంత అహంకార మెందుకు?

బాగుంది. అధికారంలో ఉన్నారు కనుక!

**ఎన్. ఎస్. జి, నిజామాబాదు**

నేటి కాలములో యువతీయువకులు సెక్సుకు సంబంధించిన పుస్తకములు చదువుటకు కారణం ఏమిటి?

విషయాలు తెలుసు కోవాలన్న జిజ్ఞాసే. అంతకు మించి కారణం ఏముంటుంది?

**బి. ఆర్, బాలసోర్**

పేర్లు పొడిఅక్షరాలతో రాస్తే ఎలా? కనీసం వారి పేరైనా పాఠకులకు తెలియవద్దా?

ఎ... పేరు వారికి రాద్దామనే ఉంటుందినాకూను. కాని పాఠకులకి తమ పేరు కంటే పక్క పేరే ఎక్కువ ఆకర్షణ కల్గిస్తుందని అనుభవంపై తెలుసుకున్న మీదటనే పొడి అక్షరాలు ప్రారంభించడం జరిగింది.

**వి. కె. ఎస్, కోటనందూరు**

కోటనందూరు ఎప్పుడేనా వచ్చారా?

ఊఁ!

**కె. పి, ఓరుగల్లు**

...దారిద్ర్యంలోని సౌఖ్యం వైరాగ్యంలోని నైర్మల్యం ఎవరు అర్థం చేసుకో కలరో?

అవిరెండూ లేనివాళ్ళు!

**ఎల్. డి, మద్రాసు**

నేను వారిని ప్రేమించాను... ఇప్పుడు ముఖం చాటు చేస్తున్నారు.

చిన్నపొరపాటు. జీవితకాలం దుఃఖానికి దారితీయొచ్చునని ముందే కొంచెం ఆలోచించుకొని ఉండవలసింది సోదరీ.

**బి. బి. ఆర్, రాజమండ్రి**

మా ఆమెకి అన్ని సమకూరుస్తాను. వీధిలోకి రావద్దంటే వినదు. ఇక్కడ మా యిద్దరికీ పేచీలు వస్తున్నాయి అక్కగారూ.

పంజరం చక్కదనం పక్షికి రుచించదుకదా తమ్ముడు గారూ.

**పి. బి. కె, కరీంనగరు**

స్త్రీయైనా పురుషుడైనా నలుగురిలో గుర్తింపబడాలంటే ఏం చేయాలంటారు?

గుర్తింప బడాలన్న తాపత్రయం వదిలిపెట్టి తిరగాలి.

**కె. ఎమ్. పి, గార**

ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' దీని భావమేమిటో తెలియచేస్తారా?

ఏముంది, ధర్మదేవత ఓడిపోతున్నప్పుడు ప్రతియుగంలోనూ కాదనే పుడతానులే అని భగవంతుడు హామీ ఇవ్వడమే!

**టి. వి. ఆర్, గూడెం**

దేవుని అసలు పేరేమి?

అసలు పేరు తెలియకనే కదా సహస్ర నామాలతో సంబోధిస్తున్నారు?

**ఆర్. ఎల్. ఎన్. ఆర్, యెల్లారెడ్డి**

ప్రకృతి పురుషున కిచ్చెడి బహుమానమేది?

బాధ్యత!

**ఎస్. ఎస్. కె, చిప్పేలి**

పంచభూతాలంటే ఏమి?

నిప్పు, నీరు, నింగి, నేల, గాలి!

# మనిషి బొమ్మ

ఇచ్ఛాపురపు రామచంద్రం



ఇంక్రిమెంటు కాగితం అందుకున్న గోపాలం కళ్ళు ఒక్కసారి ఆనందంతో మెరిశాయ్.

ఉద్యోగంలో ప్రవేశించాక యిది మొదటి యింక్రిమెంటు.

జీతంలో నాలుగురూపాయల పెరుగుదల!

నాలుగురూపాయలు! ప్రతినెలా అదనంగా నాలుగురూపాయలు!! సంవత్సరం పైగా పడిన శ్రమకు ప్రతిఫలం లభించింది. ఉద్యోగ జీవితపు సోపానాల్లో తనొకటి అధిరోహించగలిగాడు.

గోపాలం కళ్లల్లో కొంచం గర్వంతో కూడిన తృప్తి నిండింది.

మరొక్కసారి యింక్రిమెంటు కాగితాన్ని సాకల్యంగా చదువుకుని చొక్కా జేబులో దాచుకుని—ఎదురుగా కనిపించిన ఫైలునందుకోబోయి కూడా ఆగిపోయాడు.

ఆఫీసు నిశ్శబ్దంగా ఉంది. లంచ్ టైము దాటిపోతున్నా ఎవరూ సీట్లు చేరుకోలేదు. ఆఫీసరు శలవుపెట్టడాన ఆఫీసుకి దాదాపు ఆటవిడుపు. అందుచేత గుమాస్తాలెవరూ త్వరగా వస్తారన్న నమ్మకంలేదు.

కొద్ది నిముషాలపాటు సంతోషం కలిగించే ఆలోచనలలో విహరించాలనిపించిందతనికి

'నాకు ఇంక్రిమెంటు వచ్చింది నాన్నా!' అని ఉత్సాహంగా తండ్రికి చెప్పాలనిపించింది. కాని—మరుక్షణం బాధగా గుర్తుచేసుకున్నాడు—

తను...తన ఊరికీ, తన యింటికీ, తనవారికీ నూటయాభైమైళ్ళదూరంలో ఉన్నాడని. తక్షణం అతని ఉద్రేకం చల్లారిపోయింది. ఉత్సాహం దిగజారిపోయింది.

ఉద్యోగంకోసం ...ఉదరపోషణకోసం ... తను యింటినుంచి చాలాదూరంగా ఉంటున్నాడు ఇక్కడ—

అమ్మలేదు—ఆప్యాయతలేదు.

నాన్నలేదు—వాత్సల్యంలేదు.

తమ్ముడూ చెల్లెలూలేరు; అనురాగమూ అభిమానమూలేవు. ఉన్నదల్లా ఒక్కటే. ఉద్యోగం !

అమ్మని చూడాలని ఉంది—ఆమెపెట్టే అమృతప్రాయమైన భోజనం తినాలని ఉంది. నాన్నని చూడాలని ఉంది. ఆయన

మాటలువింటూ సేదతీరాలనిఉంది. తమ్ముడికి ధర్మోపారం పాఠాలు చెప్పాలనుంది. చెల్లెల్ని ప్రేమగా లాలించాలని ఉంది.

ఈ కోరికలన్నీ యీనాటివికావు. కొన్ని నెలల నాటివి.

స్వర్గంవంటి యింటిని తలుచుకుంటే ఉద్యోగం వదిలి పారిపోవాలనిపిస్తుంది. ఏవో సౌఖ్యాలు తనని ఊరిస్తూ ఆవంక పిలుస్తాయ్. తన మనసు అటువైపు మొగ్గే అంతలో...ఏదో అదృశ్యబంధం అడ్డు నిలుస్తుంది. మనసుకే తప్ప కంటికి తోచని ఆబంధంఏమిటి? బాధ్యతా? నాన్న ఉపదేశం గుర్తుకొచ్చి—అపరిపక్వమైన తన మెదడులో కర్తవ్యం అధికారం చెలాయిస్తుంది.

ఉద్యోగం వినా జీవితం కనులముందు కొరడా ఝుళిపిస్తుంది.

ఊహలో మెదిలే భవిష్యత్తులోని భయంకరత్వాన్ని భరించలేక మెదడుకి మనసుకీ కళ్ళాలువేసుకుని—తను మళ్ళీ మామూలు గోపాలం—గుమాస్తా గోపాలం ఐపోతాడు. ఆత్మీయులంతా తన చుట్టూ ఉన్నట్టే ఊహించుకుని హృదయాన్ని మభ్యపెట్టుకుంటాడు.

'ఇవాళ గోపాలానికి—ఇంక్రిమెంట్ వచ్చింది. మొట్టమొదటిది కనుక కాఫీలు తెప్పించమనాలి.'

ఆమాటలు విని—పక్కగదిలోకి గుమాస్తాలు చేరుకున్నారని గ్రహించాడు గోపాలం. ఎదురుగా ఉన్న ఫైలందుకుని దానిలోకి చూస్తూ కూర్చున్నాడు.

'గోపాలంచేత కాఫీలు తెప్పించగలిగితే రెండు రూపాయలు పందెం'!

'మై డియర్ వేణూ, కొత్తగావచ్చావు కనుక నీకు గోపాలం సంగతి తెలియదు. గోపాలమంటే ఎవరనుకున్నావ్? తోటి గుమాస్తాకి పెళ్ళికానుక కొందామంటే ఐదురూపాయలు చందాయివ్వని అపరషైలాక్ ! అతనే కనుక ఆఫీసుకి కాఫీలిస్తే అష్టగ్రహకూటమి మళ్ళీ తప్పదు!'

'మరీ అంత అన్యాయంగా మాట్లాడకు శంకరం. ఎంతయినా అతనూ మనతోటి గుమస్తాయేకద ? సరదాగా అడిగి చూస్తే తప్పేముంది?'

'అబ్బే. తప్పేమీలేదు. అతనుకాదన్నాక మొహం మార్చుకోకుండా వచ్చెయ్. ఒకటి మాత్రం పచ్చి నిజం. గోపాలంచేత కాఫీలు తెప్పించడం నీతరం కాదుకదా నిన్ను పుట్టించిన బ్రహ్మతరంకూడాకాదు. గోపాలం అంటే సాక్షాత్తూ లుబ్ధావధానులు.' నవ్వేడు శంకరం.

'ఆఫీసులో ఉన్నది అంతా కలిపి యిరవైమంది. మనం అడిగేది కేవలం కాఫీయేగాని పార్టీ కాదు. కనుక నాలుగు రూపాయలకంటే ఖర్చుకాదు.'

నాలుగు రూపాయలు ! ఆఫీసులో కాఫీలకోసం !!

గోపాలం గుండెలు దడదడలాడేయ్. ఒక్కసారి జేబులోకి చెయ్యిపెట్టుకుని చూసుకున్నాడు. ఇంక్రిమెంట్ కాగితం మృదువుగా తగిలింది.

తను సంవత్సరం శ్రమపడి సాధించేడీ ఫలితాన్ని. కష్టపడినది తను. ఫలితం సాధించింది తను మధ్య వీళ్ళకెందుకు కాఫీ లివ్వాలి ? ఏమైనాసరే చూస్తూ చూస్తూ కాఫీలకోసం నాలుగు రూపాయలు తను ఖర్చుపెట్టలేడు.

గోపాలం గుండె దిటవు చేసుకుని మళ్లీ ఫైలులోకి చూడసాగాడు.

'అతను మనకి కాఫీలూ యివ్వొద్దు, గీఫీలూ యివ్వొద్దు. ఆ కుళ్ళుగుడ్డలు వదిలేసి ఆఫీసుకి శుభ్రమైన గుడ్డలు కట్టుకు వస్తే అదే పదివేలు. ఆ కంపు గుడ్డలు భరించలేక ఛస్తున్నాం.'

'నిజమే వేణూ ! ఈ రోజుల్లో ప్యూన్లు కూడా టెరిలిన్లే వేసుకుంటున్నారు. అప్పారావూ సింహాచలమూ చూడు ఎంత నీటుగా ఉంటారో.? గోపాలం మనలాటి గుమాస్తా అనుకునేందుకు కూడా సిగ్గు సిగ్గు.'

ఎప్పుడూ ఖరీదైన దుస్తులే ధరించే సుందరం గొంతు.

గోపాలం హృదయం బాధగా మూలిగింది.

తను వేసుకునే బట్టలు అతిసాధారణమైనవే కాని అపరిశుభ్రమైనవి మాత్రం కావు. కానీ – అప్పారావూ సింహాచలమూ వేసుకునే వాటితో పోల్చి చూస్తే ...... నిజమే...తను వేసుకునేవి మంచివిమాత్రం కావు. తనెనాడూ టెరిలిన్ బట్టలను ముట్టుకుని కూడా చూడలేదు.

అప్రయత్నంగా ఆ రోజు ... గోపాలం మెదడులోకి బాధగా గుర్తుకొచ్చింది...

ఆ రోజు ... జీతాలు వచ్చిన రోజు.

సుందరం వేసుకున్న సరికొత్త పాముకుబుసాలవంటి టెరిలిన్ బట్టలు చూస్తూంటే అటువంటివి తను కూడా వేసుకోవాలనిపించింది. ఆ కోరిక తనను విపరీతంగా వశపరచుకుంది. జీతం పట్టుకుని సరాసరి 'రవీ రెడీమేడ్' స్టోర్స్‌కి వెళ్ళాడు.

'టెరిలిన్ జత చూపించండి.'

మెర్క్యురీదీపాల మృదువైన కాంతిలో షాపువాడు బయటకు తీసిన టెరిలిన్ జత మిలమిల మెరుస్తూ అపరిమితంగా ఆకర్షించింది.

'ఎంత ?'

'నూట నలభై.'

త్రుళ్ళిపడ్డాడు గోపాలం.

జేబులో ఉన్న జీతం నూటయిరవైతొమ్మిది మాత్రమే—అని గుర్తుకొచ్చి అతను చప్పగా చల్లారిపోయాడు.

'పోనీ యీ జత చూడండి. ఏభై రూపాయలే.' మరొకజత చూపించేడు షాపువాలా.

అవికూడా చాలా అద్భుతంగానే కనిపించాయ్. నిజానికివే ఎక్కువ బాగున్నాయనిపించి ఏభైరూపాయ లందించి ప్యాకెట్ తీసుకుని చీకటి పడుతూంటే తనగది చేరుకున్నాడు.

'గది అంటే—ఎండ నుంచే తప్ప వాన నుంచి ఏమాత్రమూ రక్షణనీయలేని పాడుబడిన యింటి కప్పదిగువ తొమ్మిదడుగుల పొడవూ ఆరడుగుల వెడల్పూగల స్థలం. పెచ్చులూడుతూంటుంది గచ్చు. పళ్ళు పైకిపెట్టి వెక్కిరిస్తున్న భూతాల ముఖాల్లా గోడలు.

ఆ గదిలోకి రావడానికి గాలి భయపడుతుంది. వెలుతురు సంకోచిస్తుంది. నిర్భీతగా ఆ గదిలోకి వెళ్ళగలిగింది గోపాలం ఒక్కడే. ఆగది అంటే అతనికి చాలా యిష్టం.

చాప పరుచుకున్నా కుంపటి పెట్టవండుకుందుకు కావలసినజాగా ఉంటుంది. వంటగిన్నెలు మూడూ, కంచమూ దాచుకుందు కొక గూడుంది. ఊరికి దాదాపు మధ్యగా ఉంది కనుక ఎటుపోవాలన్నా అట్టేదూరం పోనవసరంలేదు. ఇన్ని

# మనిషి బొమ్మ

నడుమ పాయాలతో ఆ గది అద్దె ఐదు రూపాయలే! పట్నంలో యింత చవకగా మరేగది దొరుకుతుంది.? గదిమరీ పెద్దదైతే ఊడ్చుకోడం కష్టం. తన హరికేన్ దీపం మార్చుకోవాలి. ఈబాధలేమీ కలుగనీయని ఆ గదంటే గోపాలానికి చాలా యిష్టం.

హరికేన్‌దీపం వెలిగించి ప్యాకెట్ లోంచి బట్టలు పైకితీసి చూసుకున్నాడు గోపాలం. అతిపల్చని వెలుగులో కూడా అవి మిలమిల మెరిశాయ్ — అచ్చంగా పాము కుబుసాలకి మల్లే.

బూజులు రాలుతున్న ఆ గదిలో కొంచం నల్లగా ఉన్న తన శరీరంమీద... ఆ బట్టలు వేసుకుని చూసాడు గోపాలం.

మసకవెలుతురులో . ఒకమూల యినుప కుంపటి.. మరొకమూల బొగ్గుల డబ్బా ...దండేనికి వేలాడుతున్న మాసినబట్టలు . వీటన్నిటి మధ్యా కొత్తబట్టలతో తను!

గోపాలం కంపించి పోయాడు. తను పెద్దనేరం చేసినట్లు అనిపించి అతను మెల్లగా కూలబడి పోయాడు.

ఏమిటి ? తన అజ్ఞానమేమిటి ?

ఒకజత బట్టలకోసం ఏభై రూపాయలు...

ఆ క్షణంలో అతనికి చాలా వాస్తవాలు తెలిసి రాసాగాయ్.

ఈ ఖరీదైన దుస్తులను తన నిరాడంబర దుస్తుల మధ్య ఉంచడం అన్యాయం ఇవి వేసుకుని తను అల్యూమినియం గిన్నెలతో కుంపటిమీద వండుకోడం అసాధ్యం

మాటిమాటికీ ఉతికితే యివి చిరిగి పోతాయ్.

అదీకాక వీటిఖరీదు ఏభై రూపాయలు! ఎందుకంత త్వరపడి ముందు చూపు లేని మూర్ఖుడైపోయాడు తను ? గడప వలసిన రోజులు ముందున్నాయని ఎలా మరిచిపోగలిగాడు తను ?

ఒకజత బట్టలకోసం ఏభైరూపాయలు ఖర్చు చేయగలిగే తాహతు తనకు లేదని ఎందుకు విస్మరించాడు ?

ఆఫీసులో అందరూ కట్టుకోవచ్చు ఒకటి రెండుసార్లు వసుంధర కూడా సూచించి ఉండవచ్చు. అయితే ? ఇది ఎగరలేని ఎత్తుకెగిరి కాళ్లు విరుచుకోడం కాదూ ?

ఏభై రూపాయలు!...కన్నీరు ముంచుకొచ్చింది గోపాలానికి.

ఆ దుస్తులు పాము పడగలలా మారి తనవంక చూస్తూ బుసలు కొడుతున్నట్లుంది.

'ఈ దుస్తులు తను వేసుకోలేదు... వేసుకుని అంతరాత్మఘోష భరించలేదు. తను చాలా మూర్ఖుడైపోయాడు.'

త్వరత్వరగా వాటిని ప్యాకెట్‌లో పెట్టి షాపుకి పరుగెత్తాడు.

'ఇవి వాపస్ తీసుకోండి—' లొస్పుతూ అందించాడు పాకెట్.

'ఉహుఁ...' తిరస్కరించాడు షాపు యజమాని.

ప్రపంచం యావత్తూ అంధకారమయమై పోయింది. ఆపాదమస్తకమూ కంపించి పోసాగాడు గోపాలం. అతనికళ్ల వెంట నీరు కారడం ప్రారంభించింది. ఎంత ప్రయత్నించినా దుఃఖం ఆపుకోలేక పోతున్నాడు.

'నేను మూర్ఖుణ్ని. పిచ్చివాడిని... ఇంతమంచి బట్టలు వేసుకునే అర్హత నాకులేదు. దయచేసి వీటిని తీసేసుకుని నా డబ్బు నా కిప్పించండి. లేకపోతే నెల్లాళ్లు పస్తులుండవలసి వస్తుంది. క్షమించి సీటిని తీసుకోరూ ?!'

రుద్ధకంఠంతో ప్రార్థిస్తున్న గోపాలాన్ని చూసి—'పిచ్చివాడిలా ఉన్నాడని గొణుక్కుంటూ ప్యాకెట్ తీసుకుని అర్థ రూపాయి తగ్గించి అతని డబ్బు వాపస్ చేశాడు షాపతను.

గది చేరుకుని గోపాలం మనసు తేలిక పడేలా కన్నీరు కార్చేడు.

తన పొరపాటుకి శిక్ష అర్థరూపాయి! ఇంకెప్పుడూ తొందరపడి క్షణిక బలహీనతలకూ సరదాలకీ లోబడకూడదు—

అలా బుద్ధిచెప్పుకుని ఆ రాత్రి పస్తుండి తననుతానే శిక్షించుకున్నాడు గోపాలం.

'ఎందుకయ్యా ఆ దిష్టిబొమ్మగురించి క్లైము వేస్తు చేస్తారు? ఆ మాసిన గుడ్డలూ, నలిగిన చెప్పులూ మనకి శ్రీరామరక్ష. గుమాస్తా స్థితిని గుర్తు చేస్తూ అటువంటి స్పెసిమెన్ ఒకటుండడం మనకి మంచిదే. అతన్ని చూసి మనం గర్వపడుతూ ఉండవచ్చు.'

దిష్టిబొమ్మ! గోపాలం మనసులో బాణం గ్రుచ్చుకుంది.

తను దిష్టిబొమ్మా ? వాళ్లకి మల్లే ఖరీదైన బట్టలు వేసుకోనంత మాత్రాన, ఆడంబరాలకి పోనంతమాత్రాన తనుమనిషి కాకుండా దిష్టిబొమ్మ ఐపోతాడా ? నిజమే. తను రంగులు పూయని మట్టిబొమ్మ... అయితేమాత్రం... వారు తనని చూసి జాలిపడాలికాని యిలా హేళన చేయడం ఏం న్యాయం ?



నిజంగా వాళ్ళకు తెలియదూ తని గదిలో ఉన్నాడని వారి మాటలు విని 'తను బాధపడతాడని ?

'ఒక విషయం తెలుసా మీకు ?'

గోపాలంగుండెలు ఆత్రుతగా భయంగా కొట్టుకున్నాయి.

'మనవాడు శ్రమజీవి. తన వంట తనే వండుకుంటాడు. ఫర్లాంగు దూరం నుంచి నీళ్ళు తెచ్చుకుంటాడు. తన గుడ్డలు తనే ...'

'గాంధీ మహాత్ముడిలా ఐపోవాలని కాబోలు !'

ఒక్కసారి అయిదారు గొంతుకల నవ్వుల పరంపర !

గోపాలం గుండెల్లో బాణాల పరంపర. భరించలేక పోయాడు.

భగవాన్...తనపై వాళ్ళందరికీ ఎందుకింత పగ ? వాచా మనసా కర్మణా తను వారికే అపకారమూ చెయ్యలేదే !

తనని హేళనచేసి వారు పొందే ఆనంద మేమిటి ?

దిష్టిబొమ్మ... ఒంటిగొట్టు రామలింగడు... షైలాక్... లుబ్ధావధానులు ... యిన్ని బిరుదాలు ప్రసాదించారు. ఇంకా తృప్తి తీరకనేనా యిలా తనవంక గురి చూసి వాగ్బాణాలు విసురుతున్నారు ?

తన హృదయాన్ని చిత్రవధచేసి వారు పొందే లాభమేమిటి ?

తను ఒక మనిషి. తన కొక బ్రతుకుంది. అది వాళ్ళకళ్ళకు కొంచెం చిత్రంగాను కనిపించవచ్చు. అంత మాత్రాన తన నింత నిర్దయగా శిక్షించడం వారికి న్యాయమేనా ? తన జీవిత వైఖరిని వాళ్ళందు కసహ్యించుకోవాలి ? మాటలు విని మనసులో బాధపడకుండా ఉండగలగడానికి తను మరబొమ్మ కాదు. ఇవి ఎందుకు గ్రహించరా క్రూరాత్ములు ?

వాళ్ళకి తనమీద శత్రుత్వం. కారణం— తను ఒంటరిగా మిగిలిపోయాడు వారితో స్నేహం చేయకుండా.

తనకు స్నేహితులు కావాలి. స్నేహంలోని మాధుర్యం తనకి తెలుసు. కాని — తను కోరుకునే స్నేహం వాళ్ళివ్వరు. ఇవ్వలేరు. తనుకోరే స్నేహంలో చాలా స్వార్థం ఉంది. స్నేహితులకోసం కాఫీ లివ్వడంవంటి చిన్న చిన్న త్యాగాలు కూడా చెయ్యలేదు తను. స్నేహితులని తన గదికి ఆహ్వానించలేదు. వారికి తనపట్ల కాని తన

# మనిషి బొమ్మ

జీవితంపట్లకానీ ఏమాత్రం కుతూహలమూ ఉండకూడదు. ఇన్ని పరిధులు తన స్నేహానికి! ఈ పరిధులలో ఎవరూ ఉండరని తనకి తెలుసు. అందుకే హృదయం ఎంత ఆరాటపడినా తనెవరినీ స్నేహితులుగా ఆహ్వానించలేకపోయాడు. అందుకే తోటి గుమాస్తాలదృష్టిలో తను ఒంటిగొట్టు రామలింగడు.

'మురికిగుడ్డలు వేసుకుంటాడనీ, ఎవరితో మాట్లాడడని గోపాలం గురించి బుద్ధిమంతుడని అపోహపడ నవసరం లేదు.'

'ఏమిటి నువ్వనేది?'

పడబోతున్న పిడుగేమిటా అని తల్లడిల్లుతూ తలెత్తాడు గోపాలం.

'గాంధీ బొమ్మపక్క ఎర్రమేడ ఎందుకు ప్రసిద్ధో మీకు తెలుసుగా?'

'ఆహా! అర్ధరూపాయనుంచి అయిదు రూపాయలదాకా ఆటబొమ్మలు— ప్రాణమున్న ఆడబొమ్మలు దొరుకుతాయ్.'

'ఇప్పుడా మేడకి గోపాలం—పద్దెనిమిది నిండిన పుత్తడిబొమ్మ నొదాన్ని ప్రియురాలిగా చేసుకున్నాడు. ఆమెను మనవాడు మోహించాడు. ప్రతిసాయంత్రం ఆరుగంటలకి అక్కడికిపోతాడు. తిరిగి వస్తూండగా నేనెప్పుడూ చూడలేదు—'

'వసుంధరా!' జాలిగా అనుకున్నాడు గోపాలం. అతని ముఖం ఎర్రబడిపోయింది. నా కారణంగా నువ్వూ వీళ్ల నోళ్లల్లో నీచంగా నలుగుతున్నావ్ నన్ను క్షమించు. వీళ్ళు మనుషులుకారు. నిన్నూ నన్నూ అర్థంచేసుకుని ఆమోదించగలిగే ఔన్నత్యం వీరిలో లేదు. వీళ్లెప్పుడూ రంగుటద్దాలలోంచే చూడగలరు. వీరికి కళ్లేకాని మనసులేదు.

వీళ్లెన్నయినా అననీ. నిజం నాకు తెలుసు. ఈ పట్నంలో నన్ను గౌరవించేదీ ఆదరించేదీ నువ్వే. ఏ ఆశయం కోసం నువ్వు నాకు చేరువయ్యావో అది నెరవేరేదాకా నిన్ను దూరం చేసుకోను.'

'ఆ సుఖాన్ని కొనుక్కొందుకు మన గోపాలం ఎన్ని అవతారాలెత్తుతాడో తెలుసా? ఉదయం ఏడునుంచి తొమ్మిదివరకూ – శ్రీ ప్రెస్‌లో కంపోజింగ్ చేస్తాడు. నెలకి నలభై యిస్తారుట.'

'శ్రీలా మహల్‌లో రెండవ ఆటకి బుకింగ్‌లో కూర్చుంటాడు. రెండుపార్లు నాకే టిక్కట్లమ్మాడు. వాళ్లూ ఏ పాతికో ముప్ఫయ్యో యివ్వకపోరు.'

'ఎన్ని అవతారాలెత్తితే ఏం? నదులన్నీ సముద్రంలో కలిసినట్లు ఇతనార్జించినదంతా ఆ ఎర్రమేడ పాలేగా!

సరిగా తిండితినడు. శుభ్రమైన బట్ట కట్టడు. ఆర్జించేదంతా ఆ సానిపాపకు సమర్పించడమేగా.

అదుపులోపెట్టడానికమ్మా నాన్నా లేరు. వాళ్లకి తెలిస్తే—ఎంతబాధ పడతారో యీ తుచ్ఛుడిగురించి.'

ఇక భరించలేకపోయాడు గోపాలం.

వాళ్లముందుకువెళ్లి ఏదో చేసెయ్యాలన్న ఉద్రేకంతో లేచి నిలబడ్డాడు. కాని—మరుక్షణం గుర్తొచ్చింది — వాళ్లంతా ఒకటి. తనొకడు ఎదిరించినా ప్రయోజనముండదని.

పెదవి కొరుక్కుంటూ లీవ్ లెటరు రాసి హెడ్‌క్లర్కుకిచ్చి గదికి బయల్దేరాడు. ఆ గదిలో ఎన్ని అసౌఖ్యాలున్నా పుష్కలంగా ఏకాంతం లభిస్తుంది. తలుపులు తీస్తూనే వెళ్లి చాపమీద వాలిపోయాడు.

ఏకాంతం లభించగానే అతని దుఃఖం యినుమడించింది. హృదయానికి తగిలిన ఘాతాలకు సాంత్వన కలిగించాలని కన్నీరు కట్టలు తెంచుకోసాగింది.

తనవంటి నికృష్టజీవి, నిర్భాగ్యుడూ ఇంకెవరూ ఉండరనిపించిందతనికి. ఒంటరిగా యావత్ప్రపంచాన్ని ఎదుర్కోడం అసాధ్యమనిపించింది. ఒక్కసారి తన జీవితం జ్ఞాపకంవచ్చి అతని విషాదం వేయింతలయింది. తల గోడకేసి బాదుకోవాలన్నంత ఉద్రేకం...ఏదో నిస్పృహ... అంతులేని నిరాశ...అన్నీ ఒక్కుమ్మడిగా అతన్ని చుట్టుముట్టాయ్. సరిగ్గా ఆ క్షణంలో...

'గోపాలం' ఎక్కడినుంచో మెల్లగా పిలుపు.

తలెత్తి చూశాడతను.

కళ్లకెదురుగా హుందాగా నిలుచున్నాడు ఊహామూర్తి గోపాలరావ్. ఖరీదైన కారులో...టెరిలిన్ సూట్ వేసు

కుని—కళ్ళనిండా కాంతి నింపుకుని— పదిమందీ చూసి ఈర్ష్యపడేంత గొప్పగా ఉన్నాడు గోపాలరావ్.

అతని కన్నులు జాలి కురిపిస్తున్నాయ్ గోపాలంమీద.

'ఇలా చూడు గోపాలం.'

గోపాలం చూడలేదు. తలవంచుకున్నాడు.

మామూలుగా అయితే తనలోని ఊహామూర్తి కనుపించేసరికి గోపాలం ఉత్సాహభరితుడయ్యేవాడు. కాని— ఆ క్షణాల్లో అతనూ గోపాలాన్నేమాత్రమూ ఊరడించలేకపోతున్నాడు.

'నేను గోపాలం...నీ ఏకైక మిత్రుడిని. నన్ను నిర్లక్ష్యం చేస్తావా? నీ ఆశలూ ఆశయాలూ అన్నీ నేనేకద? నన్నే మరిచిపోయావా? అటుచూడు. ఆ గోడమీద గొంగళి పురుగు పాకుతూంది. ప్రస్తుతం ప్రపంచంచేత అపరిమితంగా అసహ్యించుకోబడే ఆ పురుగే అతిత్వరలో గూడు కట్టుకుని సమాధిలో ఉంటుంది కొన్నాళ్లపాటు. తరువాత? సమయం చూసుకుని గూడు చించుకుని బయట పడుతుంది. అప్పటి కది గొంగళి పురుగు నుంచి సీతాకోక చిలుకగా పరిణామం చెందుతుంది.

గొంగళిపురుగు అసహ్యకరమైన రూపానికీ సీతాకోకచిలుక రంగు రంగుల రెక్కలలోని ఆకర్షణకీ ఎంత వ్యత్యాసం? ఈ వ్యత్యాసం కలిగించినది కాలం! ఆలోచించు గోపాలం...నేను చెప్పినది నిజమేనా, కాదా?

ఈనాడు నువ్వింకా, కోశదశలోనే ఉన్నావు కనుక తాత్కాలికమైన కష్టాలు కొన్ని భరించక తప్పదు. సీతాకోక చిలుక ఆవాలంటే గొంగళి పురుగుదశ అనుభవించక తప్పదు.

ఓ, మనిషీ!...కొన్నాళ్లు ఏ అనుభూతులూ పట్టించుకోకుండా బొమ్మలా బ్రతికితే—భవిష్యత్తు బంగారమవౌతుంది. ఈనాడు నలుగురిచేతా చిన్నచూపు చూడబడే నీవే—కాలక్రమాన నలుగురూ ఈర్ష్యపడేంత గొప్పవాడి వౌతావ్.

నీ జీవితమంతా ముందే ఉంది. ఇక లే...నీ విచారాన్నవతలకు నెట్టిపారేసి భవిష్యత్తుకోసం వర్తమానంలో నిర్వర్తించవలసిన కర్తవ్యాన్ని గుర్తు తెచ్చుకో.'

గోపాలం తలెత్తి చూసేసరికి అతనిలోని ఊహా మూర్తి గోపాలరావ్, ఇంతవరకూ హితబోధచేసిన శ్రేయోభిలాషి అదృశ్యమైపోయాడు.

అతని కంటికెదురుగా పాతడైరీ సాక్షాత్కరించింది బట్టల పెట్టెమీద నుంచి;

అతను లేచి ఆ డైరీ అందుకుని మెల్లిగా పేజీలు తిప్పతూంటే పాత ఉత్తరం జారిపడింది.

ఒక్కసారి దానివంక చూసేడు.

తను ఉద్యోగంలో చేరిన మూడవ రోజున అందిన ఆ ఉత్తరం—ఉద్యోగంలో చేరుతూ అనుకన్న రంగు రంగుల కలలన్నిటిని అంత మొందించి—తనకు కళ్ళు తెరిపించిన ఆ ఉత్తరం—భారంగా చదువు కోసాగాడు గోపాలం,

'చిరంజీవి గోపీ!

ఈపాటికి ఉద్యోగంలో చేరిఉంటావు. ఆ విషయం వెంటనే వ్రాయి. నీ గురించి యిక్కడ మేమంతా ఆత్రుతగా ఉంటామని మరిచిపోకు. ఒకవిషయం—ఇన్నాళ్ళూ ముఖాముఖీ నీకు చెప్పనిది—రాస్తున్నా నీ ఉత్తరంలో. బహుశా ఏ తండ్రీ కొడుక్కి యిలా వ్రాయవలసినంత దిగజారి ఉండడేమో! అంత దురదృష్టవంతుడు నేను తప్ప మరెవరూ ఉండరనే నా విశ్వాసం.

అప్పులూ—ఆస్తీ ఏమీలేకుండా ఎలిమెంటరీ మేస్టారి గిరితో నా వాస్తవ జీవితం ప్రారంభమైంది. ఉద్యోగం ఎటువంటిదో నువ్వు ఊహించగలవ్. తాత్కాలికావసరాలూ...సుఖాలూ వీటి ప్రభావంతో నేను భవిష్యత్తుగురించి ఏమాత్రమూ ఆలోచించలేకపోయానని యిప్పుడు చాలా చింతిస్తున్నాను. కాని ప్రయోజనమేమిటి?

ఉద్యోగంనుంచి విశ్రాంతి యిచ్చేసింది ప్రభుత్వం. జీవితంనుంచి మాత్రం విశ్రాంతి లేదు. నా అప్రయోజకత్వం కారణంగానే ఎంత బుద్ధిమంతుడివైనా చురుకైన వాడివైనా నిన్ను పై చదువులకి పంపలేక ఎదుగూ బొదుగూ లేని గుమాస్తా ఉద్యోగానికి పంపేను ఎంత మనస్కరించకపోయినా.

ముప్పయ్ రూపాయల పెన్షన్ లో కుటుంబం గడవడం అసాధ్యమైనప్పుడు నిన్నింకేం చదివించేది?

నువ్వు...తమ్ముడు...చెల్లెలు...అనారోగ్యంతో బాధపడుతున్న నా అమ్మ—నా నలుగురూ నేను పరిష్కరించలేని సమస్యలే ఐపోయారు.

నిన్నూ తమ్ముడినీ తలుచుకుంటే ఒకవంక ఆనందం - మరొకవంక బాధ. నా భవిష్యత్తుకి నేనేం చేయగలను?

నువ్వు నిజంగా దురదృష్టవంతుడివి గోపీ! అందుకే పెద్దకొడుకుగా పుట్టావు. కొన్ని సంవత్సరాలు ముందుకానీ వెనుకకానీ జన్మిస్తే నీ జాతకం ఎలా ఉండేదో?






వయసుతో వంగిపోయిన నా భుజాలింక యీ భారాలని మోయలేని స్థితికి వచ్చేశాయి. కొంతగా కొంత నువ్వు ప్రయోజకుడి వయ్యావు. తండ్రి తరువాత కుటుంబ భారం మోయవలసింది పెద్ద కొడుకే.

నీకోసం సుఖాలను సిద్ధపరచడం పోయి—సమస్యలనే వదిలిపెడుతున్నాను. ఇది అసమర్థతా అన్యాయమూ అని తెలిసినా—అనివార్యమే ఐంది. నాకు తెలుసు. నా చేతులారా నేనే నీ భవిష్యద్విహంగపు రెక్కలను కత్తిరిస్తున్నానని. కాని—ఏంచేయగలను?

నీముందు నేను విడిచిపెడుతున్నవి నాలుగు సమస్యలు.

నీ తమ్ముడి చదువు, నీ చెల్లెలిపెళ్ళి... నీ అమ్మ అనారోగ్యం...ఏ క్షణంలోనైనా నేను హఠాత్తుగా కన్నుమూస్తే యావత్ కుటుంబ భారాన్నీ నీ భుజస్కంధాలపై వహించడం. ఈ కుటుంబం ఉద్ధరించబడాలంటూ జరిగితే అది కేవలం నీ ప్రయోజకత్వంవల్లనే కావాలి. అందుచేత నువ్వే నీ కర్తవ్యాన్ని నిర్ణయించుకో.

నీ నాన్నను నలుగురూ వేదాంతి అంటారు కదూ! వాళ్ళకి నిజం తెలియదు- నా వేదాంతానికి పునాది అసమర్థతే అని.

ఒకమాట బాబూ...నీపై నాకు చాలా ఆశలున్నాయ్.

# మనిషి బొమ్మ

నువ్వు కులదీపకుడివౌతావ్. కొన్నాళ్ల పాటు నేను వదిలిన సమస్యలు నిన్ను నలువైపులా బంధించినా త్వరలోనే వీటిని సమర్థవంతంగా పరిష్కరించగలవ్. అంతవరకూ నీ జీవితంలో కొంత చీకటి భరించక తప్పదు.

నాకు తెలుసు బాబూ...ఈ క్షణాల్లో నీ జీవితం గాలిపటంలా పైకెగిరిపోవాలని కోరుకుంటూ ఉంటుందని. కాని గాలిపటం సక్రమంగా ఎగరాలంటే దానికి కట్టిన దారం చాలా అవసరం.

ఇప్పటికే సుదీర్ఘమైన ఉత్తరం వ్రాసేను. నన్నర్థంచేసుకో బాబూ. తరచుగా నీక్షేమం వ్రాస్తూ ఉండు. ఈ కోరికల్లోమాత్రం స్వార్థంలేదు బాబూ... అంతా పితృవాత్సల్యమే. అపార్థం చేసుకోవు కదూ?

మీనాన్న...పార్వతీశం.'

కొన్నిక్షణాలపాటు శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు గోపాలం.

దూరంగా గడియారం ఆరుగంటలు కొట్టింది.

'మాస్టారూ! పరీక్షలుదగ్గర పడుతున్నాయ్.. మీ రొక్కరోజు పాఠం మానేసినా నేను పరీక్ష ప్యాసుకాలేను. అప్పుడు నాకీ నరకం మరింత తప్పనిసరవుతుంది... త్వరగా రండి మాస్టారూ ... నా ఆశలూ ఆశయాలూ వృథా చేయకండి. నా పతిత జీవితాన్ని ఉద్ధరించండి—' అంటూ వసుంధర కన్నీటితో పిలిచినట్లయి హఠాత్తుగాలేచి కళ్లు తుడుకుని బట్టలు వేసుకోసాగాడు గోపాలం.

ఆ ఉత్తరాన్ని తిరిగి డైరీలో భద్రపరుస్తూ తనలోతానే అనుకున్నాడు.

'నాన్నా! నువ్వప్పగించిన కర్తవ్యాలు సరిగ్గానే నెరవేరుస్తున్నాను. నెలనెలా డెబ్బయ్‌రూపాయలు జీతంలోంచి పంపుతున్నాను, అరవైతో నా జీవితం సుఖంగానే గడుస్తోంది.

ప్రెస్‌వాళ్లిచ్చే నలభై చెల్లెలిపేర బ్యాంకులో వేస్తున్నాను, పెళ్ళికి ఉపయోగిస్తుందని.

సినిమాహాలు వాళ్లిచ్చే పాతిక రూపాయలూ తమ్ముడి కాలేజీ చదువుకని వేరే బ్యాంకులో వేస్తున్నాను వాడిపేర.

వసుంధరకి ప్రైవేటు చెప్తున్నాను నాన్నా. వేశ్యావృత్తి ఆమెకెంతమాత్రమూ యిష్టంలేదు. మెట్రిక్ పాసై—ఏదైనా ఉద్యోగం చూసుకుని గౌరవనీయమైన జీవితం గడపాలని ఆమె ఆశయం. అందుకే నలుగురూ నన్నపార్థం చేసుకుంటున్నా ఆమెకి ట్యూషన్ చెప్పి—ఆమెయిచ్చే జీవితం అమ్మమందులకని పంపిస్తున్నాను.

ఏం నాన్నా, నేను నా కర్తవ్యాలని సరిగ్గా నిర్వర్తిస్తున్నానా?

నా ధ్యేయమల్లా ఒక్కటే. నువ్వు ప్రశాంతంగా గడపాలి నీ వృద్ధాప్యం. గతం తలుచుకుని నువ్వు విచారించకూడదు.

నాకు తెలుసు నాన్నా, నా జీవితం త్వరలో మలుపు తిరుగుతుంది. అప్పుడింకా ఎన్ని సమస్యలైనా అతి సులభంలా ఎదుర్కోగలను. అంతవరకూ—నేను బొమ్మనే నాన్నా, ఎవరి విమర్శలూ నన్ను బాధించవు. ఏ కష్టనష్టాలూ నన్ను చలింపజేయవు.

కర్తవ్య నిర్వహణ కలిగించే తృప్తి ముందే కష్టాలైనా తీసికట్టే, అనుభవం మీద గ్రహిస్తున్నాను నాన్నా యీ జీవిత సత్యాన్ని.'

తలుపువేసి—ఎర్రమేడకి బయలుదేరాడు గోపాలం. అతని అడుగులు అతి తేలికగా సాగిపోతున్నాయ్.



# వారఫలం

## 1-3-68 శుక్రవారం మొదలు 7-3-68 గురువారం వరకు

[illegible] మీ తాలూకు వస్తువులుపోయే ప్రమాదం ఉంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**వృషభం** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వతంత్రంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మిథునం:** ఆదాయం మాట యెలాగున్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభించగలవు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**కర్కాటకం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:** కొన్ని వ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా, అది ఇతరులకు చెడుగానే కన్పిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వారం మధ్యలో అనుకూలపరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో అనుకూలవార్తలను వింటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— స్వల్ప అనారోగ్యం చేస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కన్య** ఫలితంమాట యెలావున్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగ నెరవేరుతుంది. వ్యాపారంలో ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. వారంమధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. ఉద్యోగంలో ముఖ్యమైన పనులు మీరు స్వయంగా చూడడం మంచిది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల ముందు ముందు కూడా ఉపయోగం ఉంటుంది. వృత్తిరీత్యాచేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు. సాటివారితో మాటపట్టింపులు తగవు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**ధనుస్సు:** సామాన్యమైన పనులకుకూడ విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. ఆర్థికవ్యవహారాల్లో మొగమాటాలు తగవు సాహసంతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది.

స్త్రీలకు— [illegible] జీవనానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం.** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారులవల్ల జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ఇతరులమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ఉద్యోగంలో గౌరవము బాగ ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగ ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

— మహేష్



# మోడు మోళ్ళు

అచ్యుతవల్లి

### జరిగిన కథ

కవిరాజ ధన్వంతరీ నిలయం నరస[illegible]గారికి ఇద్దరు [illegible] కొడుకులు. పెద్దపిల్ల కామేశ్వరి. పెళ్ళి [illegible] వుంది. తర్వాత వాడు [illegible] కాలేజీలో [illegible]. తర్వాతది [illegible]. చిన్నవాడు [illegible] చదువు తున్నాడు. భార్య [illegible], పిల్లలూ అంతా ఆయన సంపాదన [illegible] ఆధారపడి వున్నారు. కామేశ్వరి [illegible] అందంగా [illegible]. కామేశ్వరి [illegible] సంబంధాలు [illegible] ఏ ఒక్క సంబంధమూ [illegible] లేదు. [illegible] పోతూ వున్నట్టుగానే, [illegible] ఒక సంబంధం వచ్చింది. రెండవ పెళ్ళి [illegible] కేశవరావు తో కామేశ్వరికి వివాహమైంది. [illegible] రాజేశ్వరి అభిరుచిని తెలుసుకున్న [illegible] నళినితో [illegible] [illegible]. మాధవ నళిని [illegible]. [illegible] కామేశ్వరిని పరిచయం చెయ్యాలని [illegible].

## 7

ఆ రాత్రి కేశవ దగ్గర అంది కామేశ్వరి!

'మా వాళ్ళకి నన్ను చూడాలని వుందట వెళ్ళమంటారా?'

కేశవ ఆశ్చర్యంగా ఆమె వెంపు చూశాడు! 'రాజేశ్వరి' ఎప్పుడూ, ఇల్లా తన అనుజ్ఞకోసం అడిగేది కాదు. ఆమె కేదితోస్తే అల్లా చేసేది. ఎక్కడికి వెళ్ళాలనుంటే అక్కడికి స్వేచ్ఛగా వెళ్ళి పోయేది!

'ఈ రోజు, ఫ్రెండ్స్‌తో కలిసి సెకండ్‌షో సినిమాకు వెళ్తున్నాను. మీరు నాకోసం చూడక హాయిగా నిద్రపొండి!' అన్న చీటీ ఒకటి తలగడమీద పెట్టి వెళ్ళిపోయేది. ఒక్కొక్కప్పుడు కేశవకి చిరాకు గల్గేది.

'చూడు రాజా, నీకోసం నేను ఇక్కడ కళ్ళల్లో వత్తులు వేసుకుని కూర్చొనుంటానే. నీవు నన్ను గుర్తించకుండా అల్లా షికార్లు ఎల్లా చేస్తావ్! అనేవాడు!

'దూరంగా వుండటంలోనే ఆకర్షణ ఎక్కువవుతుంది డియర్! నిజానికి మిమ్మల్నికాదని నేనేమి చేయగలను? మీలాంటి సంస్కార హృదయులు, నా భర్తకావటం, నా అదృష్టమనుకొంటు న్నాను!' అంటూ నవ్వేది రాజేశ్వరి. తన కేసి నిర్నిమేషంగా చూస్తూ వుండిపోయిన కేశవ వెంపు ఆశ్చర్యంగా చూసింది కామేశ్వరి!

'ఏమిటి మాట్లాడరేం?' అంది. మళ్ళీ చటుక్కున కేశవ కళ్ళముందు పరుచుకున్న నీలితెరలు తొలగిపోయేయి! అతని కిదంతా గమ్మత్తుగా తోచింది! కామేశ్వరితో తను ఎప్పుడు మాట్లాడవలసి వచ్చినా, రాజేశ్వరి జ్ఞాపకం రావటంతో, అతను తబ్బిబ్బు అవు తున్నాడు. తను చిన్నపిల్లవాడు కాదు! ఆడవాళ్ళతో మాట్లాడే అలవాటు లేని వాడుకాదు! బోలెడు మంది అమ్మాయిలకి పాఠాలు చెప్పేవాడు! రాజేశ్వరి చనిపోయి నాకకూడా, ఆయన అనేకమంది అమ్మా యిలకు, పాఠాలు, తెలీనివి' రాత్రుళ్ళు తొమ్మిదీ, పదిగంటలదాకా కూర్చుని చెప్పేవాడు! అటువంటప్పుడు కూడా ఆయ నలో ఏ వికారమూ కలిగేదికాదు! రాత్రుళ్ళు అలవాటు ప్రకారము, టేబుల్ మీదున్న గ్లాసులోని పాలుత్రాగి, మంచం మీద పడుకోబోతూ ప్రక్కమంచంకేసి చూసేవాడు! ఆ మంచం ఖాళీగా కనుపిం చేది! 'నళిని'కి రెండేళ్ళు వచ్చిందగ్గ ర్నుంచి సీతమ్మ జడుసుకుంటుందనీ, తన దగ్గర పడుక్కోబెట్టుకునేది. 'నళిని' కాన్వెంట్‌లో జేరినతర్వాత, హాలుకి ఎదు రుగా వున్నగది 'బెడ్ రూం'గా మార్చు కుంది. ఆమె బట్టల బీరువా, మున్నగు, వస్తువులన్నీ, ఆ గదిలో అమర్చుకొంది. 'నళిని!' రెండేళ్ళ పిల్లయ్యేదాకా ఆ మంచం ఖాళీగా వుండేదికాదు. కనీసం పిల్లది అన్నా ఆ మంచంమీద పడు క్కుని వుండేది. 'రాజేశ్వరి' వారానికి నాలుగురోజులు సోషల్‌సర్కిలోనే మునిగి పోయేది! ఖాళీగా వున్న మంచంకేసి, దోమతెర కంతల్లోంచి చూస్తూంటే, అతనికి తెలియకుండనే నిద్రపట్టి పోయేది! మళ్ళీ ఎప్పటికో మెలుకువ వచ్చి చూసేసరికి, సన్నని నైటుబల్బు కాంతిలో, దోమతెరలోంచి, పచ్చని మెత్తని శరీరం అలసి, నిద్రపోతూ కన్పించేది! అల్లా ఆమె వెంపు చూస్తూనే, మళ్ళీ నిద్రపోయేవాడు కేశవ!

కామేశ్వరి వచ్చింది మొదలు, ఆ మంచం ఎప్పుడూ, ఖాళీగా వుండేదికాదు! తెల్లని, పల్చని, దోమతెరలోంచి, సన్నని మెత్తటి నైటుబల్బు కాంతిలో, ఆమె నల్లనిశరీరం కన్పించుతూనే వుండేది. రాజేశ్వరి ఎప్పుడూ తను చూసేసరికి అలసి సొలసి నిద్రావివశురాలై వుండేది! కామేశ్వరి ఎప్పుడూ, నిద్రపట్టని దానిలా, పరుపుమీద అటూ ఇటూ దొర్లుతూ కన్పించేది! ఒక్కొక్కప్పుడు దోమతెరలోంచే,

'ఇంక నిద్రపోలేదా కామేశ్వరీ! అని పలకరించేవాడు కేశవ.

కామేశ్వరి నిద్రపోయినదానిలా నిద్రలోనే వత్తిగిల్లినట్లుగా నటించేది. కాని బదులు పలికేదికాదు. అల్లాంటప్పుడు, కేశవకి ఆమెది నిజంనిద్రో, దొంగనిద్రో తెలుసుకోవాలని బుద్ధిపుట్టేది. గమ్మున లేచివెళ్లి ఆమె మంచందగ్గర కాళ్ల వెంపు నించుని దోమతెర ఎత్తిచూసేవాడు. అరగంట నించున్నా, కామేశ్వరిలో చలనం వుండేదికాదు. గాఢంగా నిద్రబోతున్నట్లు, ఆమె దీర్ఘంగా తీసే ఉచ్ఛ్వాస, నిశ్వాసములు సాక్ష్యం చెప్పేవి. అప్పుడప్పుడు ఆమె పల్చని పెదాల చివరల చిన్నసిగ్గు తొంగిచూసినట్లనిపించేది! కాస్సేపు రాజేశ్వరిలా, కాస్సేపు కామేశ్వరిలా కన్పించేది ఆ శరీరం! రాజేశ్వరిలా ఆ శరీరం కన్పించినప్పుడు ఏవో కులాస కబుర్లు చెప్పేవాడు! కామేశ్వరిలా కన్పించినప్పుడు, ఆమె ముఖంకేసి చూస్తూ, దీర్ఘంగా ఆలోచించేవాడు!

'ఆఁ! నువ్వు వీరా ఇంటికి వెళ్లాలనుకుంటున్నావా!' అన్నాడు. ఇంతసేపూ అనిమేషంగా ఆమెవెంపు చూస్తూనే వున్నాడు! అతను, తన శరీరాన్ని చూపులతో తూట్లు తూట్లు పొడుస్తున్నాడని కామేశ్వరికి తెలిసిపోయింది. శరీరం అంతా, నగ్నంగా అయిపోయినట్లు కుంచించుకపోయింది! పమిటచెంగుని భుజంమీదుగా ముందుకు లాక్కుని చేతుల్లో పుచ్చుకుని గట్టిగా నలపసాగింది.

'నిజంగా నీకు వెళ్లిపోవాలనుందా కామేశ్వరీ!' తనేదో తప్పు చేసినట్లు ఆర్ద్రకంఠంతో అన్నాడు కేశవ.

ఆ గొంతుతో అతను ఆ మాటలు ఉచ్చరించిన తీరు కామేశ్వరిలో నున్న సుప్తప్రకృతిని మేల్కొల్పింది.



'మీరు వెళ్ళమంటేనే వెళ్తాను! అదైనా నాలుగురోజులుండి రావటానికే!' నెమ్మదిగా వణికే గొంతుతో అంది కామేశ్వరి.

'నువ్వెళ్ళిపోతే ఈ గది అంతా చిన్నబోతుంది కామేశ్వరీ! ఆ మాట పైకి ప్రేమగా అంటాన్ని నా వయసు సహించదు. నాలో నేను చెప్పుకోలేని, లాలస నిన్ను చూస్తే కలుగుతోంది కామేశ్వరీ ! క్షమించు!' అందామనుకున్నాడు కేశవ. కాని అల్లా ఆత్మనివేదన చేసుకోవటం అతని అభిజాత్యానికి విరుద్ధం !

'అవును! నీకు పరీక్షలు దగ్గర కొచ్చాయి! ఇప్పుడు వెళ్ళొద్దు! బాగా చదువుకోవాలి! నీకు తెలివితేటలున్నాయి. కాస్త శ్రమించావంటే, ఫ్లాసువస్తుంది !' అన్నాడు గురువుగారిలా.

'నేను పరీక్షలకు పోవటంలేదు!' అంది నింపాదిగా కామేశ్వరి

'అదేం! కూర్చో! నాకు అంతా వివరంగా చెప్పు!' అంటూ ఆతృతగా చేయి పుచ్చుకుని, కూర్చోబెట్టాడు! కొద్దిగా చలించింది కామేశ్వరి!

'అత్తగారు నక్కురూ, వుండలేకుండా వున్నారట! అంచేత మానివేయదల్చుకున్నాను' అంది.

## మూడుముళ్ళూ

'ఏమిటీ! అమ్మ నిన్ను కాలేజీకి పోవద్దందా!' అన్నాడు ఆశ్చర్యంగా.

'వూఁ' అంది.

'మరి నీకు చదువుకోవాలని వుందన్నావు?' అన్నాడు.

'ఒకప్పుడు చదువుకోవాలనే దుగ్ధ వుండేది! ఇప్పుడు నాకూ ఇంక చదువు అనవసరం అనిపిస్తోంది!' అంది.

'నీకూ చదువు అనవసరం అన్పించుతోందా?' సంభ్రమంగా అన్నాడు కేశవ.

'అవును! ఎందుకు వచ్చిన చదువులు?' అంది కామేశ్వరి !'

'చదువు మానివేస్తానన్నమాట! అయితే నీవు పుట్టింటికి వెళ్ళదల్చుకున్నావా! చదవ నవసరంలేదుగా!' దుగ్ధగా అన్నాడు కేశవ.

కామేశ్వరి మాట్లాడలేదు.

'అయితే నీ ఇష్టం! వెళ్ళితేవెళ్ళు!' అంటూ చప్పున తన మంచంమీదకువెళ్ళి దోమతెర దించుకుని పడుక్కున్నాడు! కామేశ్వరికి భర్తకి కోపం వచ్చిందని తెలిసింది. తను పుట్టింటికి వెళ్లటం అతనికి ఇష్టంలేదనుకొంది.

'పోనీ, వెళ్ళకపోతే వచ్చే నష్టం ఏమిటి!' అనుకొంది.

'ఏమండీ మీకు కోపం వచ్చిందా? మీరు వద్దంటే నేను ప్రయాణం అవనే అవను !' అందామనుకుంది. కాని అల్లా అంటానికి సిగ్గువేసి వూరుకుంది.

మర్నాడు కాలేజీ టయిమ్‌కి నళిని తయారయ్యింది కామేశ్వరి దగ్గరికొచ్చి.

'అదే ! ఇంకా అల్లాగే వున్నావ్! కాలేజీకి రావా?' అంది.

'రాను!' ముక్తసరిగా అంది కామేశ్వరి.

'ఏంచేత? వంట్లో బాగా లేదా! అప్పుడే?' వేళాకోళంగా నవ్వుతూ అంది నళిని. సిగ్గుతో చచ్చినంత పనిఅయ్యింది కామేశ్వరికి! బాధతో మెలికలు తిరిగింది ఆమె బేల హృదయం!

'లవ్ లెటర్ వ్రాసావా!' అంది నళిని.

'పూర్తిగా మానేసాను! ఇంక చదవదల్చుకోలేదు!' అంది కామేశ్వరి.

'ఏమిటీ! చదువు మానేసావా? నాన్న వద్దన్నాడా! లేకపోతే ఎవరన్నా లవ్ లెటర్స్ వ్రాసారా?' హేళనగా అంది నళిని.

'ఛ ఛ! ఏం మాటలు నళినీ' వ్యథతో కళ్ళ నీళ్ళు తిరిగాయ్ కామేశ్వరికి.

'తప్పేమన్నాను! కాలేజిలో జేరిన ప్రతీ అమ్మాయికీ విధిగా ఒకటో, అరో ప్రేమ లేఖలు వస్తూనేవుంటాయ్! ప్రేమ లేఖలు రాకపోతే అమ్మాయిలకు కాలేజీల్లో చదవాలనే ఆసక్తే వుండదని మాధవ అంటూ వుంటాడు! మరి నీకు అల్లాంటి లేఖ వస్తే చూస్తూచూస్తూ నాన్న వూరుకోగలడా!' అంది నళిని.

కామేశ్వరికి కళ్ళమ్మట నీళ్ళు గిర్రుమని తిరిగాయ్! 'తన ముఖానికి ప్రేమ లేఖలు వ్రాసేవాళ్ళు కూడా వుండాలా? అంత ఆకర్షణ తనలో వుంటే గౌరవంగా జానెడు పొట్ట నింపుకోవటంకోసం రెండోపెళ్ళి సంబందానికి ఒడంబడుతుందా?' అనుకొంది కామేశ్వరి. నిస్తేజంగా వున్న కామేశ్వరిని చూసి, కాస్త ఏడిపించ బుద్ధయింది నళినికి. వంటి నిండా పుళ్ళతో వుండి నడవలేక నడుస్తూన్న కుంటికుక్కని రాళ్ళచ్చుకుని కొట్టి అది కుయ్యోమంటూంటే చప్పట్లు చరుస్తూ ఆనందించే పసికుర్రాడి మనసు నళినిలో వుంది.



# బలము మరియు శక్తి కోసం—బోర్న్‌విటా!

2296 A TL

## బోర్న్‌విటా రుచి సాటిలేనిది..

## ఇందుకు కిటుకు—కోకో!

కోకో, పాలు, పంచదార మరియు మాల్ట్‌తో నిర్దేశితమైన పద్ధతి ప్రకారం మిశ్రణము చేసిన ఫలితము. అధిక శక్తి నిచ్చే పానీయము—బోర్న్‌విటా! బోర్న్‌విటాను వేడి పాలలో కలపండి. ఈ రుచికరమైన్న పానీయము వలన శక్తి మరియు బలము పొందండి,




బలము, శక్తి మరియు రుచి కోసం

**క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా**

## మూడుముళ్ళూ

'అన్నీ కంగారు పడిపోతా వెందుకు కామేశ్వరీ! కావాలని కాలేజీలో చేరావు! ప్రేమ లేఖలు రావటం తప్పా? మాధవని తెలుసుగా! మా క్లాసుమేటు? అతని అన్నయ్యకి నిన్ను ఇద్దామనుకున్నారట కదూ? నిజమేనా?' సూటిగా అడిగింది నళిని.

'ఏమో! నాకు గుర్తులేదు!' నాకు పద్నాలుగేళ్లు దాటింది మొదలు మా అమ్మావాళ్లూ నాకు పెళ్లి చేయాలనే ఆలోచించేవారు అప్పట్నించీ ఎన్నో సంబంధాలు చూపారు. ఎంతోమంది పెళ్లికొడుకులువచ్చి నన్ను చూసుకున్నారు. కాని వక్కరికీ నేనూ, మా వాళ్లు ఇవ్వగలిగే వరకట్నం నచ్చేది కాదు! అందుకే ఏ పెళ్లికొడుకునీ నేను గట్టిగా చూసిందీ లేదు! నచ్చుకుని మెచ్చుకుందీ లేదు!' అంది కామేశ్వరి.

'నీకు గుర్తున్నాలేకపోయినా, మాధవ అన్నయ్య రామనాథం మటుకూ, నిన్నే ఆరాధిస్తున్నాడట! మాధవ అస్తమానూ వాళ్ల అన్నగురించి చెప్తూవుంటాడు! అతను నిన్ను పెళ్లిచూపులకు వచ్చిచూచి వెళ్లింది మొదలు నీ మూర్తినే కన్నుల ముందు నిలుపుకొని, ధ్యానించుచున్నాడట! నువ్వు కూడా కథానాయికవే అని, మాధవ చెప్తేనే తెలిసింది. నాకు! లేకపోతే ఎలా తెలుస్తుంది?' అంటూ వెళ్లిపోయింది నళిని.

'హుఁ' నిశబ్దంగా, వెయ్యి ముక్కలయింది కామేశ్వరి మనస్సు.

తనదేంజన్మ? పెళ్లికానన్నిరోజులూ, తన్నిగురించి తన తల్లిదండ్రులు, ఈ పిల్లకి పెళ్లంటూచేయగల్గుతామా! అని బాధపడేవారు. పిల్లరూపురేఖలని, కట్నాల గలగలల్లో దాచగల తాహతులేదు! అతి సామాన్య కుటుంబీకులు వాళ్లు! ఎల్లావో అల్లా, వసుంధర పుణ్యామా అంటూ తనకి కన్నెచెర వదిలించేరు. ఆ చెర వదిలింది, దేముడా అనుకుంటే ఇక్కడ అసలయిన చెర ప్రారంభమయ్యింది. ఇది యావజ్జీవిత శిక్ష! కాపిటల్ పనిష్మెంట్. ఎక్కువ చిత్రహింసలు పెడుతోంది ఈశిక్ష! మూడి మాటలు, నాడి మాటలు, శూలాల్లాంటి మాటలు, అని తను పుస్తకాల్లో చదివేది! ఆమాటలు ఎల్లావుంటాయా అని ఆలోచించేది తను! పెళ్ళయ్యేదాకా ఆ మాటలు అనుభవంలోకి రాలేదు! ఇప్పుడు అనుభవంలోకివచ్చేయ్! ఈ మూడు ముళ్లధర్మమా అంటూ తనకి కొన్ని విచిత్ర మనస్తత్వాల పరిచయభాగ్యం లభించింది!

ఆ రామనాథం ఎవడో మహానుభావుడు! తనకోసం, అమిత విరహం అనుభవిస్తున్నాడట! ఆ విరహమేదో, తనకి పెళ్లికానప్పుడు ఎందుకు కలగలేదో పాపం! అప్పుడు, మూడువేలయాపాయలతో పదికాసుల బంగారంతో తన్ని కన్నెపెట్టేనే కాని తను ఆ రామనాథుడిచేత, మూడుముళ్లూ వేయించుకొందికి అర్హురాలయింది కాబోల్ను!

కామేశ్వరి ఆలోచనల్లోపడి కొట్టుకుంటూండగానే సీతమ్మ హాలులోనికి వచ్చింది.

'నువ్వు ఇస్కూలికి వెళ్లలేదామ్మా?' అంది.

'నేను కాలేజీకి వెళ్లటం మానేసాను అత్తా!' అంది కామేశ్వరి.

కోడలు తను చెప్పిన వెంటనే, తన మాటమీద గౌరవంవుంచి స్కూలు మానేసినందుకు సీతమ్మ పొంగిపోయింది.

'పోన్లే తల్లీ! మంచిపని చేసావ్! పైన కేశవ గదిలో బీరువాల నిండుకూ బోలెడు పుస్తకాలున్నాయ్! కావలిస్తే తీసుకుని హాయిగా చదువుకోంటూవూర్కో!' అని సలహా చెప్పింది సీతమ్మ.

కామేశ్వరి మేడమీద తన గదిలోనికి పోయి కిటికీలో కూర్చుంది. దూర దూరంగా కొండలకీ, ఆకాశానికీ మధ్య నున్న సరిహద్దు గీత వంకరటింకరగా కనపడుతోంది. ఆకాశంలో పక్షులు, స్వేచ్ఛగా ఎగురుతున్నాయి కొండలక్రిందుగ వున్న విశాలమైన పసరికమైదానంలో ఆవులూ, దూడలూ పచ్చికను మేస్తున్నాయి! కొండలకి ఎగబ్రాకుతూన్న ఆవులు సుద్ద ముక్కల్లా కన్పడుతున్నాయి. నిర్మలాకాశంలోని లేత నీల హరితాలు కలిసేచోట నల్లదనం వచ్చింది. ఒకమబ్బుకీ ఒకమబ్బుకీ పోలికే లేకుండా కణకణాలుగా విడిపోయి తొందర పనివున్నట్లుగా పరుగెట్టుతున్నాయి! ఆ విడిపోయిన మబ్బులను చూస్తోంటే కామేశ్వరికి తమ విభిన్న జీవన దృక్పథాలు జ్ఞప్తికి వస్తున్నాయి!

తన పుట్టింట్లో తన తల్లికీ, తన తండ్రికీ ఎప్పుడూ మాట పొంతన కుదిరేది కాదు. అస్తమానూ అయినదానికీ, కానిదానికీ పోట్లాడుకుంటూ వుండేవారు

అయినా చిత్రమేమిటంటే వాళ్ళిద్దరూ కలిసి జీవించుతున్నారు! పిల్లల్నికన్నారు! వాళ్ళని పెంచి పెద్దవాళ్ళని చేసారు! తమకు వీలున్నదాంట్లో వాళ్ళ వాళ్ళ జీవితరీతుల్ని తీర్చి దిద్దగల్గుతున్నారు!

ఇక అత్తింట్లో కూడా సామరస్యం అంతంతమాత్రంగానే వుంటోంది. ఒకళ్ళ మాటకీ, ఇంకోళ్ళమాటకీ అసలు పొత్తు కుదరదు. అత్తగారు కాలేజి చదువులు, అసలు చదువే ఆడవానికి అనవసరం అంటుంది. ఆడబిడ్డ వసుంధర ఉన్నత విద్య మనోవికాసానికి హేతువు అవుతున్న దని అంచేత అవకాశాలు వున్నంతమేరకు స్త్రీ ఉన్నతవిద్య సాధించటం ఎంతో అవసరమైవుంటుందనీ, ఉన్నతవిద్య అభ్యసించిన స్త్రీ తన జీవితాన్ని అత్యంత రమణీయంగా నడిపించుకోగల సామర్థ్యాన్ని సంతరించుకుంటుందనీ అంటుంది!

కేశవ ఒకళ్ళ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు భంగపాటు కలిగించటం సంస్కారవంతుల లక్షణంకాదనీ, స్త్రీ అయినంతమాత్రాన్న వయసులో ఒకరికంటే చిన్నది అయినంత మాత్రాన్న ఆమె ఇష్టానిష్టాలని జరగకుండా చేయబూనటం అవివేకం అన్పించుకుంటుంది అనీ అంటాడు. నళిని 'జీవితం అనుభవించాలి! ఒకళ్ళకి భయపడకూడదు. 'మర్యాద' అంటూ, లేనిపోని ముసుగులో దూరి వ్యక్తిత్వాన్ని నాశనం చేసుకోకూడదు !' ఒక విధమైన విలాస తత్వం ఆమెది!

ఇన్ని విభిన్న దృక్పధాలు గల వ్యక్తులతో ఒక సంసారం, ఒకే ఇంటి కప్పు క్రింద జరుగుతోంది! ఎలకా పిల్లీ, పామూ ముంగిసా, ఒకే గదిలోవున్నట్లు వుండాలి న్యాయంగా ఆ ఇల్లు! కాని, కేశవ వకాన ముద్రతో ఆ ఇల్లు నందనవనంలా ప్రశాంతంగా గడిచిపోతూంది!

మేడమెట్లమీద బరువైన అడుగుల సవ్వడి వినిపించి, కామేశ్వరి గదిలోంచి, వరాండాలోకి వచ్చింది ! మెట్లుఎక్కి వస్తోన్న గవ్రరాజుని చూసి ఆశ్చర్య పోయింది కామేశ్వరి ! ఒకే చేతితో తనంత పొడుగునావున్న అమృతపాణీ అరటిపళ్ళగెలా, చెరుకుగడలమోపు ఇంకో చేతితోనూ పట్టుకుని పైకి బరువుగా వచ్చాడు గవ్రరాజు !

* * *

— గవ్రరాజు ఒక విచిత్రమైన వ్యక్తి! కొంతమందికి ఒక దురభిమానం వుంటుంది. తమవల్ల, వూరందరూ ఉపకారం పొందుతూండాలనీ, లోకమంతా తమ పరోపకార చింతనని గుర్తించి తమకి 'విశ్వసేవా పతకం' ఇవ్వాలనీ వుంటుంది. గవ్రరాజు కచ్చితంగా, ఆ తరహాకే చెందుతాడు! గవ్రరాజుకి ఈకీర్తికాంక్ష వయసు వచ్చినప్పట్నించీ వయసుతో పాటు పెరగజొచ్చింది. అసలు గవ్రరాజు చిన్నప్పుడు ఒట్టి గడుగ్గాయిలా వుండేవాడు! అల్లరి చిల్లరిగా తిరుగుతూ, చదువుకునేవాడు కాదు! తండ్రికి విసుగొచ్చి చావగొట్టేవాడు! దానితో ఇంకా రెచ్చిపోయి, ఇంట్లో చేతికి అందిన డబ్బులు పట్టుకుని పారిపోయేవాడు ! ఆ డబ్బుతో జల్సాగా హోటళ్ళమ్మట తిరిగివచ్చేవాడు ! క్షమార్పణలు, కన్నీళ్ళు, వట్టులూ, ప్రమాణాలూ, మొదలైన తతంగమంతా జరిపి తండ్రి మళ్ళీ జేరనిచ్చేవాడు! నాలుగురోజులు ఇంటిపట్టున వుండి బుద్ధిగా పుస్తకాలు ముందేసుకుని కూర్చునేవాడు ! అయిదోరోజున మళ్ళీ విశ్రాంతిపొంది విసుగుచెందిన అతని శరీరం అతన్ని 'ఎడ్వెంచర్'కి ప్రోత్సహించేది ! ఈ 'కొరమాలిన' కొడుకుని, ఎలా దారిలోనికి తేవాలో అర్థంకాక, ఆ తల్లిదండ్రులు తికమక పడిపోయేవారు ! వాళ్ళు బ్రతికి ఉన్నన్నిరోజులూ, 'గవ్రరాజు'కి ధనార్జన చేయాలనే దృష్టి వుండేదికాదు. ఎప్పుడు చేతిలో డబ్బు అయిపోతే అప్పుడు ఇంటికివచ్చి తల్లిదండ్రుల కాళ్ళమీదపడి, వాళ్ళకి భక్తిప్రపత్తులు, ప్రదర్శించి, ఇంట్లో స్థానం సంపాదించుకునేవాడు!

తల్లితండ్రులు చనిపోగానే అతని రాకపోకలు, అతని ఇద్దరన్నలకు కానీ, వాళ్ళ భార్యలకి కానీ, ఇష్టంగా వుండేది కాదు ! విసుక్కుంటూ, కసుక్కుంటూ, ఇంత తిండి బయటవసారాలో పడేసేవారు ! ఎవళ్ళపెట్టెలూ, బట్టలూ, సామాన్లు, వున్నగదులకి వాళ్ళు భద్రంగా తాళాలు వేసుకునేవారు. పిల్లలు, 'బాబాయి, బాబాయి' అంటూ చేరబోతే ఆ పిల్లల్ని తిట్టికొట్టి గదుల్లోకి తోసేసేవారు. కొత్తల్లో, గవ్రరాజు ఇదంతా పట్టించుకునేవాడుకాదు! కాని రాను రానూ ఆ ఇంట్లో అతనికి ఏమీ ఆదరణ లభించటం లేదని, తన్ని పురుగుకన్నా, కనాకష్టంగా



చూస్తున్నారని గ్రహించేడు! అతనికి బాధ కలిగింది! ఎంతయినా మానవుడు!

ఒకరోజు పెద్దన్న పనిచేసే ఆఫీసు కెళ్ళాడు గవర్రాజు.

'ఏరా ఇలా వచ్చావ్!' విసుగ్గా అన్నాడు పెద్దన్న.

'నాకు కొంచెం డబ్బు కావాలి!' అన్నాడు గవర్రాజు.

'ఎందుకు?' కోపంగా అన్నాడు.

'వూరికి వెళ్ళాలి!' చిన్నతనంతో ముడుచుకుపోయేడు గవర్రాజు. ఎందువల్లో తండ్రిలా చనువుగా పెద్దన్నని డబాయించలేకపోయేడు గవర్రాజు.

'ఏ వూరికి వెళ్తావ్! ఏమిటా రాచకార్యం! ఇంట్లో ఈసారి నీచేతికి ఏమీ అందలేదల్లే వుంది! బుద్ధిగా అడుగుతున్నావ్! ఇదిగో! ఒకమాట చెబుతున్నాను రాజూ! మేమూ, పిల్లాజెల్లాతో గౌరవంగా బ్రతుకుతున్నవాళ్ళం! మన బాబు మనకు డబ్బు చెట్లేమీ దొడ్లో పాతిపెట్టి ఇయ్యలేదు! రెక్కాడితేనే, డొక్కాడేది! ఏదో సంసారాల్ని! నువ్వు మాటిమాటికీ వొచ్చి నాప్రాణం పీడించి పెట్టి మమ్మల్ని కూడా డబ్బుకోసం పీడించితే మా దగ్గరేం వుంటుంది? నీ బ్రతుకు నీవు చూసుకోలేకుండా మా మీద ఆధారపడితే మేము ఎన్నిరోజులని పోషించగలం?' అన్నాడు.

'వూరికి నా ఖర్మాన్న నేను పోతానంటే డబ్బు ఇయ్యలేనంటారు! ఇంట్లో వుంటే వదినలకు విస్తట్లో అన్నం వడ్డించటమే మహాకష్టంగా వుంటోంది! విసుక్కుంటూ ముష్టివాడికి మల్లే పడేస్తారు!' అన్నాడు గవర్రాజు.

'ఇంత డబ్బు సంపాదించుకుంటూంటే మాజీవితాలే తిన్నగా వెళ్ళటంలేదు! తేరతిండివాళ్ళమటుకు నీకు గౌరవాన్నిస్తూ, ఎక్కడ్నుంచి తెచ్చిపెడతారు?' అన్నాడు అన్న.

అన్న మాటలకు ఉక్రోష పడ్డాడు గవర్రాజు

'అయితే నావాటా నాకు పంచియ్యండి! నా ఖర్మాన్న నేను పోతాను!'

గవర్రాజు మాటలకు పెద్దగా నవ్వాడు పెద్దన్న.

'అసలు మనకు వాటాలు వేసుకోవాలనంత ఆస్తిపాస్తులు మన నాన్నగారు మిగిల్చాడనుకున్నావా? ఆస్తి వున్నదేదో నీకు డబ్బు అవసరం వచ్చినప్పుడల్లా తెగ నమ్మటానికే హరించుకుపోయింది? నీవేమన్నా, అయ్యో మనకు ఇద్దరన్నలు వున్నారు! వాళ్ళు పోషించాల్సిన భార్యాబిడ్డ లున్నారు! అని ఆలోచించావా? ఒక చిన్న పాదుషాలా వెలిగించావు జీవితాన్ని! వాళ్ళు బ్రతికున్న నాల్గురోజులూ, నీకు చదువు సంధ్యలు అబ్బలేదని బెంగపెట్టుకున్నారు కాని, అయ్యో! పెద్దాళ్ళిద్దరికీ, పెళ్ళిళ్ళుచేసి సంసారాలూ, నెత్తికెక్కించాం! చాలీచాలని జీతాలతో వాళ్ళకి సంసారం ఎల్లా జరుగుతుందీ? ఉన్న మడిచెక్క కూడా అమ్మేసి, చిన్నాడి చేతులో పోసేశాం, అని ఆలోచించారా! పొలం అమ్మిన డబ్బులో మేము చిల్లికానీ కూడా ఇంట్లోకి ఖర్చు నిమిత్తం తీసుకోలేదు! ఏదో! తల్లితండ్రులు! పెద్దవాళ్ళు! వాళ్ళే సంసారం నిర్వహించుతున్నారు! అని వూరుకునేవాళ్ళం! వూరుకున్నందుకు ఏమయింది? మా నెత్తినే చేతులుపెట్టి చల్లగా జారుకున్నారు! గుప్పెడు గింజలు, ఇంట్లోకివచ్చే దారిలేక, మేము మా సంసారాలను, ఎంత గిజాటుగా నడుపుకుంటున్నామో నీకేం తెలుసు? ఇప్పాళ నువ్వు హఠాత్తుగా, నీకు వాటాపంచి ఇమ్మంటున్నావ్! ఏముంది నీకు ఇవ్వటానికి? ఆ బొక్కికొంప వకటున్నది! బాగుచేయించటానికి మాకు స్తోమతు లేదు. ఇల్లంత చవుడుబారిపోయింది. పెంకులు చితికిపోయి, సకల దిక్పాలకులూ, ఇంట్లోకి తొంగిచూస్తారు! అది అమ్మితే తట్టెడు పెంకులిచ్చి కూడా కొనరు!' అన్నాడు పెద్దన్న.

'పోనీ! రెండువందలు అప్పుగా ఇయ్యి! ఏదయినా వ్యాపారం పెట్టుకుంటాను. కలిసిరాగానే, నీ డబ్బు నీకు ఇచ్చేస్తాను. ఈ ఉపకారమన్నా చెయ్యి! మనం ఒక కడుపునపుట్టి పెరిగిన ఏకోదరులం! నాన్నవున్న రోజుల్లో నాకు ఆర్జనమీద దృష్టి కాని, ఆర్జించాలనే అవసరం కానీ వుండేదికాదు! గతం మర్చిపోయి నాకు ఈ చిన్న సాయం చెయ్యి!' దీనంగా అన్నాడు గవర్రాజు.

'నీకు కలిసిరావటం అంటూ వుంటుందా? ఇంక మళ్ళీ మళ్ళీవచ్చి డబ్బు అడిగి మమ్మల్ని బాధపెట్టకు! మేము నీకు ఇవ్వలేకపోతే మాకూ, దిగులుగానే వుంటుంది!' అన్నాడు పెద్దన్న.



రెండువందలరూపాయలూ పుచ్చుకున్న గవర్రాజు ఏంచేయాలో తోచక, నాలుగయిదురోజులు అటూ ఇటూ వూరికే తిరిగాడు! ఒక నెలరోజులూ పూర్తిగా గడిచేసరికి, గవర్రాజు చేతిలో ఒక యాభయ్‌రూపాయలే మిగిలేయ్! గవర్రాజుకి గాభరాపట్టుకుంది. అనుకోకుండా తల్లీతండ్రీ గుర్తుకివచ్చి కళ్ళు చెమ్మగిల్లాయ్! దుష్టుడైనా, శిష్టుడైనా ప్రయోజకుడైనా, అప్రయోజకుడైనా, కన్నకడుపు కనుక, కన్నతల్లితండ్రులు కోరకుండగానే క్షమిస్తారు! కాని పైవాళ్ళకి, అన్నతమ్ములకయితే మటుకు క్షమించాల్సిన అవసరం ఏముంది? లోకంతోపాటే వాళ్ళూనూ!

రైల్వే ప్లాటుఫారంమీద, కళ్ళ నీళ్ళతో, అలగం తిరుగుతూ ఆలోచించుకుంటూన్న గవర్రాజుకి, చిన్న ఇత్తడి పళ్ళెంలో బీడీకట్టలూ, కిళ్ళీలూ, పెట్టుకుని అమ్ముకుంటూన్న పద్నాలుగేళ్ళ వున్న కుర్రవాడు కన్పించాడు. గవర్రాజుకి తారకమంత్రం దొరికినంత బ్రహ్మానందమయింది. అతను వ్యాపారం చేయాలనుకున్నాడు. కాని ఏం వ్యాపారం చేయాల్నో అతనికి తోచేదికాదు! ఇప్పుడు, ఆ కుర్రాడిని చూస్తూంటే అతనికి అకస్మాత్తుగా ఈ కిళ్ళీల వ్యాపారం సులువనిపించింది! అయిదురూపాయలుపెట్టి కిళ్ళీలూ, సిగరెట్టుపెట్టెలూ కొని ప్లాట్‌ఫారంమీదకి వచ్చాడు. నాలుగయిదు ట్రయిన్లు వెళ్ళేసరికి అతని అయిదురూపాయల సరుకూ, అమ్ముడుపోయింది. డెబ్భయ్ పైసలు లాభం తేలింది. కాని రైల్వే ప్లాటుఫారం మీద సరుకు, అమ్ముకోటానికి లైసెన్సు వుండాలి! ఆ లైసెన్సు అంత తేలిగ్గా వచ్చేదికాదు! దానికి చాలామందిని కాళ్ళూకడుపూ పట్టుకుని బ్రతిమిలాడుకోవాలి! అల్లాంటి శషభిషలు పట్టం గవర్రాజుకి చేతకాదు! అంచేత ఖర్చు తక్కువలో చిన్న రేకు బడ్డీ చేయించి, నరసయ్యగారింటిముందున్న ఖాళీజాగాలో ఆయన అనుమతి తీసుకొని పెట్టాడు. ఆ జాగాలోనికివచ్చిచేరిన వేళావిశేషం ఏమిటో కాని అతని రేఖ, సుడి తిరిగింది! గాలి మళ్ళింది! ఆజాగా నాలుగురోడ్ల కూడలిలోవుంది! బస్సులూ, లారీలూ, రాకపోకలూ, సమ్మర్దంగావున్న రాస్తా అవటంవల్లనే, అతని వ్యాపారం సాఫీగా గడిచిపోయేది! పైగా ఆ నాలుగురోడ్ల మధ్యా అదొక్కటే పాన్ బీడా షాపు! ఒక ఏడాది గడిచేసరికి, అన్నగారి రెండు వందలరూపాయలూ పట్టుకుని వెళ్ళాడు! పిల్లలందరికీ పిప్పరమెంటులూ, చక్కెరకేళీబిళ్ళలూ, వదినలకి జాకెటుబట్టలూ, ఇచ్చాడు! వదినలు ఎంతో సాదరంగా కుశల ప్రశ్నలువేసి స్నానానికి వేన్నీళ్ళుపెట్టి కమ్మనివేతితో, పెరుగుతో, బంగాళాదుంపలకూరతో భోజనం పెట్టారు! అన్నలు తమ్ముడి ప్రయోజకత్వం చూసి సంబరపడ్డారు. మెచ్చుకున్నారు.

'ఎక్కడో అరవైమైళ్ళదూరంలో నీవక్కడ వంటిగా వుండటం ఎందుకు?













ఆ షాపు ఇక్కడే పెట్టుకోవచ్చుగా? వేళాపాళాలేకుండా, హోటలుకు వెళ్ళుతుంటే ఆరోగ్యం చెడిపోదూ?' అన్నాడు చిన్నన్న!

డబ్బుయొక్క విలువ బాగా తెలిసి వచ్చింది! గవర్రాజుకి! 'మా సంసారాలు మేమే జరుపుకోలేకుండా వున్నాం నిన్ను కూడా ఎక్కడ పోషిస్తాం?' అన్నవాళ్ళకి ఇంతదయ కలగటానికీ, వంటిగాడయిపోయేడే తమ్ముడు— అన్న ప్రేమ పొంగటానికీ, కారణం డబ్బే కదా! ప్రేమగా చూసారు కదా అని, ఆ షాపు ఎత్తిపెట్టుకుని ఇక్కడకు వస్తే మళ్ళీ నష్టంవస్తే, వీళ్ళు తీరుమారదన్న హామీ, ఎక్కడవుంది? లాభంవస్తే దాయాదులు పంజాదారులౌతారు, నష్టంవస్తే భరిస్తారా? తనకు తనవాళ్ళెవరూ లేరు! అన్నలు స్వార్థపరులు! వాళ్ళ సంసారం గొడవ తేవాసి, ఇతరుల జోక్యం కలిగించుకోరు! తనకి కూడా ఒక 'భార్యాపిల్లలూ' అన్న సంసారం ఏర్పడితే, తన ఆర్జనకి లక్ష్యం ఏర్పడుతుంది. కష్టసుఖాల్లో పాలుపుచ్చుకోగల బంధువు తల్లితండ్రుల తర్వాత భార్య ఒక్కతే అయివుంటుంది!

గవర్రాజుకి శరీరం గగుర్పొడిచింది. అతనికి ముప్ఫయ్ ఏళ్ళు పైబడ్డాయ్! ఇంతవరకూ స్త్రీ సాహచర్యం ఎరుగడు! తల్లితండ్రులు ఇచ్చిన డబ్బు పేకాటలో, పేకాట, సినిమాలూ, సిగరెట్లకే ఖర్చు అయిపోయేది కాని స్త్రీ వ్యసనం మటుకు లేదు! అంచేత అతని ఆరోగ్యం దృఢంగావుంది! నాలుగుడబ్బులు కూడేసుకుని తర్వాత నెమ్మదిగా ఒక మంచి పిల్లనిచూసుకుని పెళ్ళిచేసుకుని గృహస్థుగా మారాలి' అనుకున్నాడు గవర్రాజు! అంచేత,

'ఇక్కడిజాగా, నాకు అచ్చివచ్చింది! చిన్నన్నా! నాలుగయిదేళ్ళు అటూఇటో వుంటాను! నష్టం వచ్చినా భరించకలిగే స్తోమతు కలిగేక ఇంక ఎక్కడికివచ్చి వున్నా ఇబ్బంది వుండదు! మళ్ళీ మొదటికి వస్తే ఎల్లా మీరుమటుకు భరాయిస్తారు?' అన్నాడు గవర్రాజు

'గడుసుతనం నేర్చాడు మరిదిగారు! మీ సంపాదనమటుకు, అన్నలు ఖర్చుపెడుతారా! ఏదో ఇంటపట్టునవుంటే, పెళ్ళి పేరంటం, చేయొచ్చని మీ అన్నల వూహ!' అంది పెద్దవదిన.

గవర్రాజు నవ్వి వూరుకున్నాడు!

(ఇంకా వుంది)

# యాత్రికులు

అరక్





రాత్రి వాన కురిసింది. తెల్లవారినా యింకా కురుస్తూనే వుంది.

చుట్టుపక్కల వూరిగుడిసెలు, బస్తీకి పోయే రోడ్డు, దాని ప్రక్కన టీ దుకాణం, ముందు బల్లలు, అన్నీ వానలో తడిసి పోయాయి తెల్లవార్లు.

టీ దుకాణం ఎదురుగా ఓ పెద్ద మర్రి చెట్టుంది. ఆ చెట్టు చాలా పురాతనమైంది. ఆ చెట్టుక్రింద ఎండాకాలం ఎన్నోబళ్ళు, పశువులు, మనుషులు, నీడలో నిలుస్తారు. ఐనా ఆచెట్టుక్రింద ఇంకా ఖాళీవుంటుంది. క్రొత్తగా బస్తీకి బస్సులు వచ్చాక, ఆ చెట్టు క్రింద బస్సుస్టాండు వెలిసింది.

ఆ బస్సుస్టాండులో రాత్రి, ఆఖోతు వాన కొచ్చి నిలబడ్డది. రాత్రి అక్కడే నిద్ర పోయింది. తెల్లారాక కూడా అక్కడేవుంది.

మాయింటి మేడమీద గదిలో కూర్చుంటే ఇవన్నీ కనుపిస్తాయి.

వానవల్ల బట్టకు కదిలే వీలులేదు. నిన్న వచ్చిన పేపరు చూస్తు కూర్చున్నా!

నాంచారయ్య, వానవల్ల టీ దుకాణం ఆలశ్యంగా తెరిచాడు.

మామూలు రోజుల్లో తెల్లవారు ఝూమున కోడికూసేవేళకు, వచ్చి దుకాణం తెరవటం రివాజు.

పనికుర్రాడు, గిన్నెలు, డేకిసాలు వానలో గోతంకప్పుకుని కడుగుతుంటే నాంచారయ్య, పొయ్యిముట్టించే ప్రయత్నంలో వున్నాడు.

మా వూరు అభివృద్ధికి నాంచారయ్య టీ దుకాణం చిహ్నం!

బస్తీకి రోడ్డువేసి చాలారోజులైంది. ఐనా బస్సులు రాలేదు. పట్నం వెళ్ళాలంటే 6 మైళ్ళు నడిచి బురదైనా! ఎండైనా, ప్రక్కవూరెళ్ళి బస్సెక్కాల్సిందే, అలా వుండేది పూర్వం.

మేం చదువుకునేరోజుల్లో ఆరోడ్డు కూడా లేదు. నడిచి ప్రక్కవూరెళ్ళి, చదువుకునే వచ్చేవాళ్ళం. మా నాన్నను సైకిలు కొనమంటే, రోడ్డువెయ్యనీ కొంటా ననేవాడు. తీరా రోడ్డుపడ్డాక, కాలేజి చదువులకు పట్నమే వెళ్ళాల్సి రావటంతో సైకిలల్లా మోటారు సైకిలైంది. మానాన్న అప్పుడూ కొనలేదు. వెధవ మోటారుసైకిలెందుకురా, కొన్నాళ్ళాగు కారుకొందాం అనేవాడు.

ఆయన కారు కొనలేదు. కానీ చదువు పూర్తయింది. అప్పుడు, ఇంటిదగ్గరేవుండి వ్యవసాయం చేయించుకునేవాడికి, కార్లూ సైకిళ్ళు దేనికిరా? అన్నాడు. అని ఆ విషయాన్ని వాపచుట్టినట్లు చుట్టి, అటక మీద పారేశాడు.

రోడ్డువేసిన కొన్నాళ్ళకు, రాయలసీమ నుంచి, నాంచారాయ్య మావూరొచ్చాడు. వచ్చేప్పుడు వెంట, గిరిజాల క్రాపు, నెత్తిన గుడ్డతో వచ్చాడు. వచ్చాక, రెండురోజులు వూళ్ళో నాలుగువీధులు తిరిగి, మా మేడ కెదురుగా, మర్రిచెట్టుకు ప్రక్కగా, రోడ్డు వెంబడి ఓ పాకవేశాడు.

ఆ పాక ఎవర్నడిగివేశాడో ఎవరికీ తెలియదు. ఎవరన్నా అడిగితే మునసబుగారు వేసుకోమన్నారనేవాడు మొదట్లో. తర్వాత మునసబుగారే అడిగితే, కరణం పేరు చెప్పాడు. కొన్నాళ్ళయ్యేసరికి వూరి పంచాయతీ ప్రెసిడెండు ఖాతాదారయ్యాడు. దాంతో మరెవ్వరూ నాంచారయ్యకు ఆ స్థలం గురించిగానీ, అందులోవేసిన పాక,టీ దుకాణం గురించిగాని ప్రశ్నించలేదు.

నాంచారయ్య, టీ దుకాణం పెట్టిన క్రొత్తల్లో నాకు అనుమానమొచ్చింది. ఇంత చిన్న పల్లెటూర్లో, అతగాడి దగ్గరి కొచ్చి టీ ఎవరు తాగుతారాని! అలా నా అనుమానం, అలాగే వుండగానే నాంచారయ్య దుకాణంలో గ్రాంఫోను వెలిసింది.

ఆ గ్రాంఫోను, మునసబుగారు వయస్సులో వుండగా కొన్నది. కొన్నాళ్ళు వాడాక, వారు రేడియో కొనుక్కున్నారు. దాంతో ముందరొచ్చిన గ్రాంఫోను మూల పడ్డది.

వాంచారయ్య అతిచౌకగా ఆ గ్రాంఫోను కొన్నాడు. ఇంట్లో మూలపడున్న ఆ వస్తువు, ఏదోవిధంగా అమ్ముడైతే చాలని మునసబుగారు అమ్మేశారు. వాంచారయ్య పట్నం తీసుకెళ్ళి ఆ గ్రాంఫోను, రిపేరుచేయించి కొన్ని క్రొత్త రికార్డులు కొని తెచ్చాడు.

మొదట్లో గ్రామఫోను పాటలు మాత్రమే విందామనివెళ్ళిన జనం, తర్వాత తర్వాత వూరికే బేవారసుగా పాటలువిని వెళ్ళటం పెద్దమనిషితనం కాదనుకుని, టీ త్రాగేవాళ్ళు, ఒకరోజు త్రాగితే మర్రోజు వాళ్ళు రాకపోయినా, వాంచారయ్య కనపడ్డప్పుడు పలకరించి, 'క్రొత్తపాటలొచ్చాయి! ఓసారొచ్చి వినండి!' అని చెప్పేవాడు.

ఇలా కొన్నాళ్ళకు వాంచారయ్య టీ దుకాణానికి మనుషులు వస్తుండటంతో, అదొక సెంటరైంది వూరికి.

ఇదిలావుండగా, ఆ దుకాణం ముందు, ఓ ముసలి బిచ్చగాడు కూడ వెలిశాడు.

ఇంత చిన్నగ్రామంలో తిరిగ్గా టీ దుకాణం ముందు కూర్చుని అడుక్కోవటం ప్రారంభించిన ఆ బిచ్చగాడ్నిగురించి, కుతూహలమేసి, ఓ రోజు వాంచారయ్యను ప్రశ్నించా!

తెల్లటి మీసాలు, ఓ సారి దువ్వుకుని, 'ఆడా బాబు! జకరయ్యని మనవాడే! పాట్లోబడిలేదరా! ఆ బడెదురు యింట్లో వుంటాడు' అని చెప్పాడు వాంచారయ్య!

'మరి పెళ్ళాం పిల్లలు లేరా?'

'పెళ్ళాం ఈ మద్దనే సచ్చినదంట బాబూ! పిల్లలున్నట్లు నాకేం తెలియదు!'

'మరి, ప్రొద్దస్తమానం కూర్చున్నా ఓ అణా అన్నా వస్తుందా!'

వాంచారయ్య బోసి నోటితో పకాపకా నవ్వాడు. నవ్వి, 'ఓరేప్పొరుబాబూ అడికి ముష్టి! అణా టీ త్రాగి, ఐదుపైసలు చేతిలోపెట్టి, చిర్లరలేదు! రేపిస్తాలే అనే జనం ఈడకొచ్చేది, యింక అడికి ముష్టెవరు ఏస్తారు.'

'మరెలా!'

'ఆడికెవరూ దిక్కు లేదుబాబూ! మొన్నామద్దె జ్వరం వచ్చి చెట్టుక్రింద పడుంటే, నేనేఎళ్ళి యిన్ని టీ నీళ్ళు గొంతులో పోశా! అయిన్సుగట్టిది గనుక బతికాడు. ఆ యిశ్వాసంతో వచ్చి ఈడనే కూకుంటాడు. పొద్దుటేనే ఎందుకురా, గుడ్డపరుసుకు కూర్చో! అని నేనే అన్నా! కూసుంటున్నాడు! మిగిలితె యింత ఉప్మా, టీ నీళ్ళ వాడికి పోస్తాను. తిని గుడిసెకెళ్ళి తొంగుంటాడు!'

ఆ రోజునుంచీ, ఆ దుకాణంవేపు వెళ్ళినప్పుడల్లా వాడికి పైసలు వేస్తుండేవాడిని.

మొదటిరోజు పదిపైసలువేస్తే, దాన్ని ఆ రోజల్లా తడిమి చూసుకుంటూ, ముతిసిపోతూ కూర్చున్నాడు. మధ్యమధ్య నా గదివేపు, మెరిసేకళ్ళతో చూచాడు ఆ రోజల్లా.

నాకు చాలా ఆనందమేసింది. మాకున్న ధనమంతా నాకింత ఆనంద మివ్వదేమొ! ఆ పదిపైసలు నాకొక లెక్కలోనిదిగాదు. అదే జకరయ్యకు ప్రాణప్రదమైంది.

వేళ తప్పకుండా వాంచారయ్య దుకాణానికి ప్రథమంగా వచ్చేది జకరయ్య. వస్తూనే వాంచారయ్యకు నమస్కారంచేసి, పాతగోనె పట్టా పరచుకుని, కొట్టు ప్రక్కగా కూర్చునేవాడు.

వాంచారయ్య నిత్యకృత్యాలలో. తాను టీ త్రాగినప్పుడల్లా, జకరయ్యకింత టీ పొయ్యటం ఒక అంశంగా తయారైంది. ఎప్పుడన్నా ఓ బీడీ ముక్కగూడా ఇచ్చేవాడు. వాళ్ళిద్దరి అనుబంధమూ చూస్తుంటే నాకు అప్పుడప్పుడూ ఆశ్చర్య మేసేది.

ఉదయం తొమ్మిది గంటలైనా, బస్తీనుండి మొదటి బస్సు రాలేదు. జకరయ్య రాలేదు!

బస్సు రాకపోవటంతో, ఈ రోజు దినపత్రిక రాదు. పత్రిక చూడందే, నాకా రోజు ఏమిటోగా వుంటుంది! అదో పిచ్చిగా తయారైంది.

దేశ దేశాలలో జరిగే విశేషాలు తెలుసుకోవాలంటే దినపత్రిక మినహా మా వూళ్ళో మరో సాధనం, రేడియో తప్ప మరేం లేదు. నాకు పేపరంటేనే మోజు! అది పట్నంనుంచి బస్సు వస్తేగానీ రాదు!

వాన తగ్గింది. ఐనా, కారుమేఘా లింకా అలాగే వున్నాయి. చల్లటిగాలి వుండీ వుండీ వీచసాగింది.

మర్రిచెట్టుక్రింద ఆబోతు, వాన తగ్గటంతో ఊళ్ళోకి షికారు బయలుదేరింది.

బజార్లో, బురదతో నీళ్ళల్లో ఆడుకుంటున్న పిల్లలు, కేరింతలు కొడుతూ, ఆబోతువెంట బయలుదేరారు.

ఒకరూ, అరా మనుషులు, గొడుగులు వేసుకుని, వీధుల్లో తిరగసాగారు.

కుర్చీలో కూర్చుని కూర్చుని విసుగురావటంతో, లేచి మేడదిగి క్రింది కెళ్ళా!

వరండాలో నాన్నగారు పాలుకుర్చీతో పడుకుని, లంకాకుచుట్ట కాలుస్తూ, పాలెగాడు చెబుతున్న వాన విషయాలు వింటున్నాడు.

పెద్దవాగుకు గాడినిండా నీళ్ళొచ్చాయట. బస్తీనుంచి వచ్చిన బస్సు వాగుదగ్గరే ఆగిపోయిందట! తూర్పుచేలో వరంతా పడిపోయిందట ఆవానకు. వూరి చెరువుకు కళింగం దగ్గర గండి పడేలా వుండని రైతులంతా తెల్లరంగానే తట్టలు బుట్టలు తీసుకెళ్ళారుట.

ఇవి వాడు చెబుతున్న విషయాలు.

మా నాన్నకూ, బెల్లంగొట్టిన రాయికీ పోలిక లున్నాయి. ఆయన కెంతసేపూ, సుష్టుగా తినటమూ, లంకపొగాకు చుట్టలు కాల్చటమూ అలవాటు. ఆ రెండూ తండ్రి తాతలు సంపాదించిన ఆస్తిపాస్తులవల్ల సమకూరటంవల్ల, ప్రపంచం యావత్తూ, వానా వరదలో మునిగిపోయినా ఆయనకు చీమ కుట్టినట్లు వుండదు.

ఆయన బధ్ధకానికీ, మరొక ఉదాహరణేమిటంటే...గేదెదూడ వూడదీసుకు పాలు త్రాగుతున్నా చూస్తూ, చుట్ట కాల్చుకుంటూ వుంటాడేగానీ లేచి వెళ్ళి కావ్ని కట్టేయడు. జీతగాడు రావాలి, ఏవేళకైనా కట్టేయ్యాలి! లేదా దారిపొయ్యే వూళ్ళోవాళ్ళొచ్చి, ఈయన సంగతి తెలిసినవాళ్ళు కట్టెయ్యాలి.

మా నాన్న సంగతి తెలిసీ, పాలెగాడెందుకు ఆయనకీ విషయాలు చెబుతున్నాడో నా కర్థంగాలేదు.

అక్కణ్ణుంచి చిన్నగా వాంచారయ్య దుకాణానికి వెళ్ళాను. దారంతా ఒకటే బురద. రేగడినేల కావటంతో, బంకలా బురద కాళ్ళకు అతుక్కుపోగింది.

నన్ను చూస్తూనే, వాంచారయ్య, కుర్చీలోంచి లేచి ఆహ్వానించాడు.

పొయ్యిమీద నీళ్ళు తెర్లిపోతున్నాయి. పంచదారమీద ఈగలు బైఠాయించి విందులు కుడుస్తున్నాయి!

'ఇవ్వాళ బస్సురాలేదు!'

# యాత్రికులు

'అవును బాబూ! పెద్దవాగుకి పిల్లొచ్చాయట!'

'జకరయ్య రాలేదు!'

'ఆడికి రాత్రినుంచీ వళ్ళెరగని జరం బాబూ! అడ్ని చూసొచ్చేసరికి ఆలీశమైనాది పొద్దున! శానా తీవ్రంగావుంది బాబూ జొరం!'

'డాక్టరుగారు...'

'బలేవాళ్ళు బాబూ! డబ్బుగలవాళ్ళకు జొరమొచ్చినా, డాటరూవస్తాడు. ఆడికి మింగ మెతుకులేదు! ఆడికి వైద్యంచేసి, డాటరు ఏంతింటాడు బాబూ!' నాంచారయ్య ముహంలో దిగులు గోచరమైంది. ఆకాశంలోకిచూస్తూ, 'భూవిమ్మీదనూ నూకలుంటే బతుకుతాడు. లేదూ ఈసాయంత్రానికి...' ఆతర్వాత నాంచారయ్యకు మాటలు పెగల్లేదు. కళ్ళల్లో ఒక్కింతనీరు తిరిగింది.

వెళ్ళి వేడివేడి టీ తెచ్చియిచ్చాడు! మళ్ళీ చిన్నగా వాన ప్రారంభమైంది. బజార్లో ఆడుకునే పిల్లలు వానను ఆహ్వానిస్తూ పాటలు పాడసాగారు.

సోమయాజుల గారింట్లోంచి పొగ బద్ధకంగా, సిగ్గుపడుతూ పైకి రాసాగింది.

సిగరెట్ ముట్టించుకున్నాను. నాంచారయ్య వచ్చి ప్రక్కన కూర్చున్నాడు. మొహం మ్లానమైపోయింది.

'బాబూ! జకరయ్య పుట్టిపెరిగిన వూళ్ళో కన్నుమూస్తాడు. ఆడదృష్టవంతుడు బాబూ! నాకెవరున్నారు చెప్పండి? ఈ వూరుని నమ్మి కుబ్రతుకుతున్నాను. హఠాత్తుగా యములాళ్ళు బేగిరం రమ్మని కబురుతెస్తే?...' ఆగిపోయాడు. బహుశా యములాళ్ళని గురించి ఆలోచిస్తు వుండవచ్చు.

అవును! ఏ ముంది?

ఆలోచిస్తూ కూర్చున్నాను.

పెద్దవాగుదగ్గర దిగిన యాత్రికులు వస్తున్నారు. అందరి గుడ్డలు సామాన్లు తడిసి, బురద కొట్టుకున్నాయి.

ఆ వచ్చిన ప్రయాణీకులను చూస్తూనే, నాంచారయ్య, యములోళ్ళ ఆలోచన మానేసి, పొయ్యిలో మంట పెద్దదిచేసి, టీ డికాషను తయారు చేయసాగాడు.

నాకు పేపరు రాలేదు. బస్సులోనే కండక్టరు దగ్గరుండిపోయుంటుంది. ఇంటికెళ్ళి జీతగాణ్ణి పంపిద్దామని లేచాను.

వాన బాగా పెద్దదైంది. కొన్ని వందల పశువులు డొంకన పరుగెత్తుతున్న శబ్దం; వీధుల్లో నీళ్ళు, నైలాన్‌చీర ధరించినట్లుంది కనబడ్డంతవరకు. ఇళ్ళూ, పొలాలు, చెట్లు!

మళ్ళా వెళ్ళి కుర్చీలో చతికలబడ్డా!

గోడమీది సినిమాతార ముహాలమీద బల్లి కాపలా కాస్తున్నది. పొగచూరిపోయిన గోడలనిండా, ఇలవేలుపులు, వివిధ భంగిమల్లో అవతరించారు!

ఇంతలో ఓ నల్లటి కుర్రాడు, తెల్లటి గుడ్డలేసుకుని, వానలో, బురదలో నానిన బూట్లేసుకుని దుకాణంలోకి ప్రవేశించాడు. తలమీద ఆచ్ఛాదనగా వున్న జేబురుమాలుతో తడిసిన ముహం, ముంజేతులు తుడుచుకుని, వెళ్ళి ఓ మూల బల్లమీద కూర్చుని, చుట్టూ కలయచూశాడు.

'టైమెంతయిందండి?'

చెప్పాను.

ఏదో గొణుక్కున్నాడు. నాంచారయ్యను పిల్చి 'టీ ఏనా?... భోజనంకూడా పెడతావా?' అనడిగాడు.

నాంచారయ్య క్షణం ఆలోచించి, 'ఈ వూరు మీకు క్రొత్తా?' ప్రశ్నించాడు!

'ఊ!'

'ఏం పనిమీద వచ్చారు?'

'ఒకాయిన్ని చూసిపోవాలి'

'ఎవరో!'

ఆ నల్లటి, తెల్లగుడ్డల యువకుడు మాట్లాడలేదు. 'నీ కెందుకీ వివరాలు?' అన్నట్లు చూసి 'భోజనం పెట్టరా?' అనడిగాడు.

'ఆలశ్యమౌతుంది!'

'ఫరవాలేదు! ముందు తినటానికేమైనా ఇచ్చి, యిన్ని టీ నీళ్ళు పొయ్యండి' అని గోడకుచారగల పడిపోయ్యాడు.

వాన నిలబడి కురవసాగింది! వీధుల్లో నీళ్ళు తాచుపాముల్లా పరుగెడుతున్నాయి!

నాంచారయ్యదగ్గర గొడుగు తీసుకుని ఇంటికి బయలుదేరా.

*　　*　　*

నాకు భోజనం చెయ్యగానే, నిద్రపోవటం అలవాటు. ఆ అలవాటు, ఈ కాలం ఆ కాలం అనకుండా యథావిధిగా కొనసాగించబడుతున్నదంటే, మాది భుక్తికి లోటులేని సంసారం గావటమే!

నిద్రలేచేసరికి సాయంత్రం మూడు గంటలైంది. ఆవేళటికి నాగుదాటి బస్సు ఊళ్లోకొచ్చి, మర్రిచెట్టుక్రింద విశ్రాంతి తీసుకోసాగింది.

పేపరుకోసం జీతగాణ్ణి పంపిందామనుకుంటుండగానే, కండక్టరు, కుర్రాడికిచ్చి పేపరు పంపించాడు.

బీహార్‌లో క్షామం! ఉత్తరప్రదేశ్‌లో వరదలు! భారత ప్రధాని విదేశీ పర్యటన కార్యక్రమం! మిజోల తిరుగుబాటు అణచివేతకు సైన్యం సన్నద్ధం! దక్షిణ వియత్నాంలో గెరిల్లాల దాడి! అమెరికన్ సైనికుల మరణం! చక్కెర ధర హెచ్చింపు! పిల్లాడు తప్పిపోయినాడు!

పేపరు మడిచి ప్రక్కన పారేశాను!

వాన తగ్గింది. ఎండ, జ్వరపడ్డ వాడి నవ్వులా వుంది. కప్పలు బృందగానం చేయసాగాయి.



కోడెదూడొకటి వడిరోడ్డుమీద విల బడి బుసలుకొడుతున్నది.

ఇంతలో నాంచారయ్య వచ్చాడని కబురొచ్చింది. క్రిందకి వెళ్ళాను.

నాంచారయ్యా ముహం, వల్లబడిపోయింది. నన్ను చూడగానే కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. 'ఆడు ఎళ్ళిపోయినాడు బాబూ!' అన్నాడు.

ఆడంటే......జకరయ్య!

నే పది పైసలు వేసినప్పుడు, దాన్ని ఆప్యాయంగా తడుముకొంటూ, నా వేపు కృతజ్ఞతగా చూస్తున్న వాడి ముహం జ్ఞాపకానికొచ్చింది.

'ఎప్పుడు?'

'ఇప్పుడే బాబూ! ఓ అర్ధగంటైంది!'

మరణంవల్ల కొందరికి బాధలు తీరిపోతాయి! మరికొందరికి బాధలు సంక్రమిస్తాయి!

మరి జకరయ్య! మరణంవల్ల అతడి బాధలు తీరిపోయినవి! ఒక విధంగా, బ్రతుకు భయంకరమైన వాళ్ళకు మరణం వరం లాంటిది!

ఐనా నాంచారయ్య, జకరయ్య మరణానికి బాధపడుతున్నాడు! ఒక ఊరుకాదు, కులంకాదు! మతంగాదు! కనీసం వయస్సు ఒకటిగాదు!

'బాబూ! ప్రొద్దునవచ్చాడే కుర్రాడు... అదే బాబూ! తెల్లటి గుడ్డలనల్ల కుర్రాడు! జకరయ్యను చూట్టానికే వచ్చాడు! ప్రొద్దున చెప్పటానికి సిగ్గుపడ్డాడు. జకరయ్యకు ప్రమాదకరంగావుందని ఎల్లేసరికి, అక్కడున్నాడు. నన్నుచూసి సిగ్గుపడ్డాడు! బాబూ!'

'జకరయ్యకు చుట్టమా?'

'అదే తెలియదు బాబూ! కానీ ఓ యినయం కనిపెట్టినా బాబూ! జకరయ్య స్పృహ ఉన్నంతవరకూ, ఆ కుర్రాడివే చూస్తూ, ఎదో గొణుక్కొసాగాడు. ఎంత ప్రయత్నించినా నాకు మాట వినపడలా! ఆడికేమో మాట పడిపోయినాది! ఈ కుర్రాడేమో, ఆడి కళ్ళే అదేపనిగా చూస్తు వున్నాడు బాబూ!'

'తెలిసినవాడేమో?'

నాంచారయ్య మాట్లాడలేదు. ముడుచుకు కూర్చున్నాడు. క్షణమాగి, 'వెళ్ళొస్తా బాబూ, ఆడి కులపోళ్ళంతా కూడి మద్దాన్నం నుంచి ఒకటే చర్చలు జరుపుతున్నారు, ఆడికి సమాదెవరు చెయ్యాలాని! ఖర్చు ఆ నల్లకుర్రాడు పెట్టుకుంటున్నాడు! నే వెళతా బాబూ!'

నాంచారయ్య వెళ్ళిపోయాడు. బాగా ఎదిగిన జొన్నకర్రలా వుంటాడు నాంచారయ్య! రాటపాకులా క్షణం కూర్చోకుండా ఏదో పని చేస్తూనేవుంటాడు, బ్రతకటానికి!

సాయంత్రం కరిగిపొయ్యేకొద్దీ, కారుమేఘాలు క్రమ్మకోసాగాయి. రాత్రికి ఉధృతంగా వాన కురవచ్చు! పేపరు చదువుతూ వుంటే ప్రొద్దుపోయిన సంగతే తెలియలేదు!

నాంచారయ్య టీ దుకాణంముందు లాంతరు వ్రేళ్ళాడదీసివుంది! నాంచారయ్య సామానంతా కడుక్కుని సర్దుకుంటున్నాడు.

బస్తీకిపొయ్యే బస్సులో జనం ఆట్టే వున్నట్లులేదు! క్లీనరు కుర్రాడు కేకలు పెడుతున్నాడు బస్సు బయలదేరబోతోందోయ్ అని!

స్నానంచేసి భోజనంచేసి వచ్చేసరికి—మళ్ళా



# యాత్రికుం

మేడమీదకు రాత్రి తొమ్మిదైంది.

గాలి చల్లగా వీచసాగింది. మిణుగురు పురుగులు, చీకట్లో గుంపులు గుంపులుగా నృత్యం చేయసాగాయి! కప్పలు చచ్చిపోయిన వ్యక్తి తాలూకు బంధువుల్లా, గొల్లున ఏడ్వసాగాయి, ఉండీ ఉండీ!

అబోతు వానలో తాపీగా నడుస్తూన్నది వీధిలో!

'ఇంకా నిద్రపోలేదా బాబూ!'

నాంచారయ్య, గొడుగు మడిచి మూలన పెట్టి నిలబడున్నాడు.

'రా కూర్చో' కుర్చీ ముందరికి నెట్టాను!

'మీరు నిద్రపోవటం లేదని వీధిలోంచి చూసివచ్చాను బాబూ!'

'ఏమిటి సంగతులు? ఇంతరాత్రప్పుడు వచ్చావు?'

నాంచారయ్య పైకప్పుకున్న ఉత్తరీయం తొలగించి, చొక్కాలోపల జేబులోంచి, ఓ డైరీ తీశాడు.

'ఆ తెల్లగుడ్డల నల్లకుర్రాడిది బాబూ ఈ పుస్తకం! మర్చిపోయి వెళ్లిపోయాడు! జకరయ్యకు ఆ కుర్రాడు బంధువేమోనని నా అనుమానం! చూడండి బాబూ!'

నాకు నవ్వొచ్చింది జకరయ్య చచ్చిపోయాడు— బ్రతికుండగా లేని బంధువులు, అతగాడు చచ్చిపోయాక వస్తారా! వచ్చిన జకరయ్యకు ఆస్తి ఏమీలేదు! అయినా నాంచారయ్యకు తాపత్రయం!

డైరీతీసి చూశాను!

కరుణాకర్! 1940 లో జననం! ఇప్పటిదాకా కాన్వెంట్లో ఉండి చదువుకుంటున్నాడు. బి. యస్సీ. పరీక్ష వ్రాశాడు!

ఆ విషయాలన్నీ నాంచారయ్యకు చెప్పాను.

నాంచారయ్య కళ్లు విచ్చుకు చూడసాగాడు నా వేపు.

డైరీ అంతా తిరిగేశాను! అన్నీమామూలు దినచర్యకు సంబంధించినవే!

ఒక పేజీ మడచివుంటే తీసి చూశాను!

ఆగష్టు...8 'మా నాన్న బ్రతికే వున్నాడని ఈ రోజు తెలిసింది. ఈ రోజు ఫాదరీ ఆ విషయం చెప్పాడు. ఊరు, పేరు అన్నీ చెప్పి, వెళ్లి చూసిరమ్మన్నాడు!

నాకు నమ్మకం లేదు. ఇన్నాళ్లుగా, అనాథగా పెరుగుతున్న నాకు తండ్రివున్నాడని ఇంతకుముందు ఆయనగాని మరెవ్వరు గానీ చెప్పలేదు! మరివ్వాళ ఎందుకు చెప్పారో! ఆయన అబద్ధం చెప్పడు. రెండు మూడు రోజుల్లో వెళ్లిచూసి రావాలి!'

'చూశారా బాబూ! ఆ నల్లకుర్రాడు జకరయ్య కొడుకే! ఆ కుర్రాడ్ని చూడగానే నాకూ అనిపించింది బాబూ! ఆ తర్వాత చదవండి!'

ఆగష్టు 9 : 'మేరీతో సినిమాకెళ్లాను. పెళ్లి చేసుకోమంటుంది. నెలకూడ తప్పిందట! ఐతేమాత్రం! దానికి నేనే కారణమంటే ఒప్పుకోను! దానికున్న ప్రియుల్లో నే నొకణ్ణి అంతే! రేపు ఊరెడుతున్నానని చెప్పా! తనూ వస్తానంది! పీడ! దీన్నొదిలించుకోవాలి!'

నాంచారయ్య మాట్లాడలేదు! ముఖం బిగుసుకు పోయింది.

ఆగష్టు 10 : 'జకరయ్య చచ్చిపోయాడు కొన్ని నిమిషాల క్రింద! ఆ మనిషి విచారిస్తే నాకు తండ్రిలాంమాత్రం లేదు. పైగా వాడు ముష్టివాడు. నల్లగా, ఎండిపోయి, బ్రతికుండగానే శవంలా వున్నాడు! గాజు కళ్లు, బోడిగుండు, మొలకు గుడ్డలేదు, పక్కకు బట్టలేదు, ఇంట్లో ఓ వస్తువు లేని ఈ ముష్టివాడు, నా తండ్రా?

నే నమ్మను! అనవసరంగా ఫాదర్ వేధించాడు. ఈ రోజంతా క్రిమినల్ వేస్టు!

చిన్నప్పుడు, నే పుట్టగానే మిషన్ వాళ్లకి నన్నిచ్చేరుట! పెరిగి పెద్దయిందాకా, తమ విషయం చెప్పొద్దన్నారు. ఇదంతా ఫాల్స్! నాకు తండ్రిలేడు! ఒకవేళ వున్నా ఈ జకరయ్యనే ముష్టివాడుమాత్రం గాదు!'

నాంచారయ్య కళ్లవెంట నీళ్లు ధారగా కారసాగాయి!

'అన్యాయం బాబూ! ఆ వచ్చిన కుర్రాడు జకరయ్య కొడుకే బాబూ! నాకు తెలుసు!'

'ఎలా తెలుసు?'

'అంతే బాబూ! నే లేకుండా చూసి ఆ కుర్రా డెళ్లిపోయాడు. లేకపోతేనా......'

నా చేతిలో డైరీ లాక్కుని నాంచారయ్య వెళ్లిపోయాడు.

నాకంతా విచిత్రంగా కనుపించిందిదంతా!

కాసేపటికి నాంచారయ్య టీ దుకాణంలోంచి పెద్దమంట కనుపించింది.

బహుశా ఆ డైరీ, తగలబెడుతున్నాడేమో నాంచారయ్య!

# ధర్మశాస్త్రం



## మల్లన్నమంత్రి కౌటిల్య

మల్లన్నమంత్రి రాజధానిలో సూరయ్య అనే రైతు ఉండేవాడు. సూరయ్యకు కోపం, పట్టుదలా యెక్కువగా ఉండేయి. తను యేమాట అంటే ఆ మాట జరగాలంటుండేవాడు సూరయ్య. ఒకనాడు అతను భోజనం చేస్తుండగా అన్నంలో తల వెంట్రుక కన్పించింది. దానితో అతనికి కోపం వచ్చింది. 'మళ్ళీసారి గనుక అన్నంలో తలవెంట్రుక కన్పించినట్లయితే తల గొరిగించి వేస్తా'నని అతను భార్యను బెదిరించాడు.

సూరయ్య భార్య అప్పట్నుంచి చాలా జాగ్రత్తగానే ఉండేది కాని కొద్ది రోజులు అయిన తరువాత సూరయ్య భోజనం చేస్తున్నప్పుడు అతనికి అన్నంలో తలవెంట్రుక మళ్ళా కన్పించింది. అన్నమాట ప్రకారం భార్యతల గొరిగించడానికి మంగలి కోసమని వెంటనే బయల్దేరాడు సూరయ్య.

సూరయ్య పట్టుదల సంగతి అతని భార్యకు బాగా తెలుసును కాబట్టి వెంటనే ఆమె మల్లన్నమంత్రి వద్దకు వెళ్ళింది. జరిగిన సంగతంతా మల్లన్న మంత్రికి చెప్పి తనను యెలాగైనా కాపాడమని ఆమె ప్రాధేయ పడింది.

'తన భార్య మల్లన్నమంత్రి వద్దకు వెళ్ళిన సంగతి' తెల్సుకొని సూరయ్య మంగలితో సహా రాజసభకు బయల్దేరాడు. జరిగిన సంగతంతా సూరయ్య కూడా మల్లన్నమంత్రితో చెప్పి, తన భార్యను తనకు అప్పగించమని కోరాడు.

తల గొరిగించడం మంచిదికాదు. పొరబాట్లు యెవరికైనా వస్తుంటాయి. అందుచేత ఆమెను క్షమించ వలసినదిగా మల్లన్నమంత్రి సూరయ్యకు బోధించాడు. కాని సూరయ్య యెంత మాత్రం అందుకు అంగీకరించలేదు.

భార్యతల గొరిగించక పోయి నట్లయితే, తను ఆడినమాట తప్పి నట్లు కాగలదు. అది పాపం, అందు చేత ఆమె తల గొరిగించ వలసినదే నని సూరయ్య పట్టు పట్టాడు.

'అవును ఆడిన మాట తప్పకూడదు. ధర్మానికి వ్యతిరేకంగా ప్రవర్తించ కూడదు' అని మల్లన్నమంత్రి అన్నాడు. ఆ మాటలు విని సూరయ్య కూడా సంతోషించాడు. వెంటనే మల్లన్నమంత్రి సంజ్ఞచేశాడు. అప్పుడు యిద్దరు తలారులు వచ్చి సూరయ్యను బయటకు తీసికొని పోవడానికి ప్రయత్నించారు.

'ఇదేమిటి?' అని సూరయ్య మల్లన్న మంత్రిని ప్రశ్నించాడు. మల్లన్న మంత్రి దానికి యీ విధంగా సమాధానం యిచ్చాడు.

'నీవు ఆడినమాట తప్పకూడదు. అందుచేత నీ భార్యతల గొరిగించ వలసినదే. కాని భర్త బ్రతికి ఉండగా భార్యతల గొరిగించడానికి ధర్మశాస్త్రం అంగీకరించదు. కాబట్టి యీ తలారులు యిప్పుడు నిన్ను ఉరితీసి వేస్తారు. నీవు చనిపోయిన వెంటనే రాజభటులు దగ్గర ఉండి నీ భార్య తల గొరిగిస్తారు. అప్పుడూ నీమాటా నిలబడుతుంది, ధర్మశాస్త్రం కూడా అంగీకరిస్తుంది.'

ఆ మాటలు విని సూరయ్య నిర్ఘాంత పోయాడు. 'నా భార్య తల గొరిగించను. నన్ను రక్షించండని' సూరయ్య మల్లన్నమంత్రిని ప్రాధేయ పడ్డాడు. మల్లన్నమంత్రి సూరయ్యను తగినట్లుగా మందలించి వదలి వేశాడు. అప్పట్నుంచీ సూరయ్య మొండి పట్టుదలను వదలివేసి సుఖంగా జీవించ సాగాడు.







డాక్టర్ మహీధర నళినీమోహన్

ఒకానొక సాహిత్య సదస్సుకి హాజరు అవడానికి వెడుతూ ఒక మొదటి తరగతి రైలు పెట్టెలో ఆరుగురు రచయితలు కలుసుకున్నారు. వారిలో ఒకడు కథానికలు వ్రాస్తాడు. ఒకడు చారిత్రక నవలలు వ్రాస్తాడు. ఒకడు హాస్య రచనలు చేస్తాడు. ఒకడు సాంఘిక నవలలు వ్రాస్తాడు ఒకడు నాటికలు వ్రాస్తాడు. ఒకడు గేయాలు వ్రాస్తాడు. ఈ విధంగా ఆ రచయితలు ఆరుగురూ ఆరు వేరువేరు సాహిత్య శాఖలలో కృషి చేస్తున్నారు వాళ్ల పేర్లు కృష్ణశాస్త్రి, అప్పారావు, కుటుంబరావు, కామేశ్వరరావు, సత్యనారాయణ, నరసింహారావు. (పై వరుస క్రమంలో మాత్రం కాదుసుమా!)

వారిలో ప్రతి ఒక్కడూ తాను వ్రాసిన గ్రంథాలలో మంచిది ఒకటి తనతోబాటు తీసుకువచ్చి, ఆ రైలు పెట్టెలో కలిసిన తన తోటి రచయిత కొకడికి ఇచ్చాడు. ఆ విధంగా ఆ ఆరుగురిలో ప్రతి ఒక్కడూ మిగిలిన వారి రచనలలో ఒక దానిని చదువుతూ లీనమై ఉన్నారు.

కుటుంబరావు కథానికలు చదువుతున్నాడు. అప్పారావు తన కెదుటి సీటులో కూర్చున్న వ్యక్తి వ్రాసిన గేయాలు చదువుతున్నాడు. కృష్ణశాస్త్రి కథానికా రచయితకీ హాస్య రచయితకీ మధ్య కూర్చున్నాడు. చారిత్రక నవలా రచయితకు ఎదుటి సీటులో కథానికా రచయిత కూర్చున్నాడు. కామేశ్వరరావు నాటికలు చదువుతున్నాడు. కృష్ణశాస్త్రి నవలా రచయితకి బావమరది అవతాడు. సత్యనారాయణ నాటక రచయిత పక్కన కూర్చున్నాడు. కుటుంబరావు ఒక మూల కూర్చున్నాడు, అతడికి చారిత్రకం అంటే చిరాకు. కామేశ్వరరావు నవలా రచయితకు ఎదురుగా కూర్చున్నాడు. సత్యనారాయణ ప్రహసనం చదువుతున్నాడు. నరసింహారావుకి గేయాలంటే తలనొప్పి.

ఇంతకీ ఆ ఆరుగురు రచయితలలోనూ ఎవరు ఏ శాఖలో కృషి చేస్తున్నారో చెప్పకోగలరా?

### జ వా బు

ఇదివరలో 'ఏడు జంటలు' అనే సమస్య ఒకటి వ్రాసాను(30–12–66వ సంచికలో) పాఠకులకు గుర్తు ఉండే ఉంటుంది. ఈ సమస్య చాలా భాగం దానిని పోలి ఉంది, కాని పూర్తిగా అటువంటిదే అనడానికి వీలులేదు.

ఇందులో కూడా మనకు తెలిసినది అంతా వ్యతిరేక సమాచారమే. అంటే ఫలానా పేరు గల వ్యక్తి ఫలానా శాఖలో కృషి చేయడం లేదు అని మాత్రమే తెలుస్తోంది.

'కుటుంబరావు కథానికలు చదువుతున్నాడు' అని చెప్పేరు కనుక కుటుంబరావు కథానికా రచయిత కాదని తెలుస్తుంది. 'కృష్ణశాస్త్రి కథానికా రచయితకీ హాస్య రచయితకీ మధ్యలో కూర్చున్నాడు' అని చెప్పడం చేత 'కృష్ణశాస్త్రి కథానికలూ, హాస్య రచనలూ చేయడని తెలుస్తోంది. 'నరసింహారావుకి గేయాలంటే తలనొప్పి' అని చెప్పడం చేత అతడు గేయ రచయిత కాదు అని తెలుస్తోంది.

ఈ విధంగా మనకు తెలిసిన విషయాలన్నింటికీ X గుర్తులు ఆయా పేర్లకు ఎదురుగా వ్రాసుకుంటూ పోదాం 'ఏడు జంటలు' అన్న సమస్యలో లాగే. సమస్యలో ఇచ్చిన సమాచారాన్ని అంతా ఉపయోగించి X గుర్తులు పెట్టుకుంటూపోతే ఇక్కడి పట్టికలో చూపినట్లు వస్తుంది.

ఈ విధంగా పట్టిక వేయడం వల్ల సమస్య సాధింపబడలేదు. పైగా సమస్యలో ఇచ్చిన కొంత సమాచారాన్ని ఈ పట్టికలో ఉపయోగించుకోలేక పోయాం.

'కథానికా రచయిత చారిత్రక నవల రచయితకు ఎదురుగా కూర్చున్నాడు' అన్న సంగతిని పై పట్టికలో వినియోగించుకోవడం ఎల్లాగ? అల్లాగే? 'ఎదురుగా పక్కన, మధ్యలో, ఒక మూల' కూరు

| | నాటికలు | చారిత్రకం | హాస్యం | గేయాలు | కథానికలు | నవలలు |
|---|---|---|---|---|---|---|
| నరసింహారావు | | | | X | | |
| సత్యనారాయణ | X | | X | | | |
| కామేశ్వరరావు | X | | | | | X |
| కుటుంబరావు | | X | | | X | |
| అప్పారావు | | | | X | | |
| కృష్ణశాస్త్రి | | | X | | X | X |

న్నారు అన్న సమాచారాన్ని వినియోగించుకో లేదు. అందుచేతనే ఇది 'ఏడు జంటలు' వంటి సమస్య కాదు అచ్చంగా. అంత కన్న క్లిష్టమైనది.

వారు ప్రయాణం చేస్తున్నది మొదటి తరగతి రైలు పెట్టెలో. (ఈనాడు తెలుగు దేశంలో రచయిత అయిన వాడికి మొదటి తరగతి రైలు పెట్టెలో ప్రయాణం చేసే స్తోమతు ఎక్కడిదని పూర్వపక్షం చేయకండి) అటువంటి పెట్టెలో ఎదు రెదురుగా రెండు సోఫాలు ఉంటాయి. ఒక వైపున ముగ్గురూ, రెండో వైపున ముగ్గురూ కూర్చుని ఉంటారు.

'కృష్ణశాస్త్రి కథానికా రచయితకీ హాస్య రచయితకీ మధ్యలో కుర్చున్నాడు' అని సమస్యలో చెప్పి ఉండడం చేత వీరు ముగ్గురూ ఒక సోఫాలో వరుసగా (మధ్యలో కృష్ణశాస్త్రి) కూర్చున్నారని తెలుస్తోంది.

'అప్పారావు తన ఎదుటి సీటులో కూర్చున్న వ్యక్తి వ్రాసిన గేయాలు చదువుతున్నాడు' అని చెప్పి ఉండడం చేత, అప్పారావు పైన చెప్పిన వారికి ఎదుటి సోఫాలో మధ్యగా కృష్ణశాస్త్రికి ఎదురుగా కూర్చుని ఉండాలి. మరో విధంగా కూర్చోవడం సాధ్యమే కాదు. అంటే కృష్ణశాస్త్రి గేయ రచయిత అని తెలిసిపోతోంది! ఇది తెలియగానే పై పట్టికలో గేయములు అని ఉన్న నిలువు వరుసలో మిగిలిన అందరికీ ఇంటూ గుర్తులు పెట్టవచ్చు.

| | | | |
|---|---|---|---|
| చారిత్రక రచయిత | ● | ● | కథానిక రచయిత |
| అప్పారావు | ● | ● | కృష్ణశాస్త్రి (గేయాలు) |
| నవలా రచయిత | ● | ● | హాస్య రచయిత |

'కథానికా రచయిత చారిత్రక రచయితకు ఎదురుగా కూర్చున్నాడు' అని చెప్పి ఉండడం చేత, ఇంతవరకూ తెలిసిన విషయాలను బట్టి ఆ రైలు పెట్టెలో పైన చూపిన విధంగా ఆ రచయితలు కూర్చుని ఉండాలి.

'సత్యనారాయణ నాటక రచయిత పక్కన కూర్చున్నాడు' అని చెప్పడం చేత అతడు ఎడమ వరుసలో ఒక చివర అప్పారావు పక్కని కూర్చుని ఉండాలి. అంటే అప్పారావు నాటక రచయిత అన్న మాట! ఇది తెలిశాక 'నాటకం' కింద మిగిలిన రచయితలందరికీ ఇంటూ గుర్తులు పెట్టవచ్చు.

'కామేశ్వరరావు నవలా రచయితకు ఎదురుగా కూర్చున్నాడు' అని ఉండడం చేత కామేశ్వరరావు హాస్యరచయిత అయి ఉండాలి! ఇది తెలియగానే 'హాస్యం' క్రింద మిగిలిన వారందరకూ ఇంటూ గుర్తులు పెడదాం.

దానితో కుటుంబరావు నవలా రచయిత అనీ, తరువాత సత్యనారాయణ చారిత్రక రచయిత అనీ, నరసింహారావు కథానికా రచయిత అనీ తెలిసిపోతుంది.

—వారు ఆ రైలు పెట్టెలో ఈ క్రింది విధంగా కూర్చుని ఉండాలి.

| | | | |
|---|---|---|---|
| సత్యనారాయణ (చారిత్రకం) | ● | ● | నరసింహారావు (కథానిక) |
| అప్పారావు (నాటికలు) | ● | ● | కృష్ణశాస్త్రి (గేయాలు) |
| కుటుంబరావు (నవల) | ● | ● | కామేశ్వరరా(వు) (హాస్యం) |

●

# జీవన రాగం

ఉన్నవ విజయలక్ష్మి

**జరిగిన కథ**

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అతనికి భార్య పోవటంతో అత్తగారు సీతమ్మగారిదే యజమాయిషీ. వసంత నిరంజనం కూతురు. పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్ళవుతుంది. సీతమ్మగారి జ్వరం ఆమె ప్రాణాన్ని తీసుకుంది. పనంతా సుధ నెత్తిమీద పడుతుంది. ఆర్భాటాలమీద మోజు పడిన సుధ మధుని లెక్చరరు ఉద్యోగం విడిచిపెట్టి ఇతర ప్రయత్నాలు చెయ్యమంటుంది. ఆమె మాటల్ని మధు లెక్క చెయ్యలేదు. సుధ మామగార్ని సూటిపోటి మాటలనడం ప్రారంభిస్తుంది. నిరంజనం గతాన్ని నెమరువేసుకుంటూ ఆ ఆలోచనల్లో లీనమైపోతాడు. ఆ ఆలోచనల్లో సీతమ్మ తన జీవితంలో ప్రవేశించిన విధం కళ్ళముందు కదలాడుతుంది. జీవితానికి కొంత మార్పు కావాలి అనిపించింది. స్నేహితుని ఉత్తరం అతనికి కొంత తృప్తి నిచ్చింది.

## 18

తృప్తిగా వూపిరి పీల్చుకుని, ఒకటికి రెండుసార్లు ఆ ఉత్తరాన్ని చదువుకుని స్నేహితుడికి సమాధానం వ్రాయటానికి కూర్చున్నాడు నిరంజనం.

'డియర్ మూర్తీ,

నీ జాబు యిప్పుడే చేరింది. ఒట్టి మాటలే కాకుండా, అనుకున్న విధంగా వెంచర్ చెయ్యగలిగిన నిన్ను నేను అభినందిస్తున్నాను — నీకు నా సహకారం ఎప్పుడూ వుంటుంది. నీవు సూచించిన విధంగా పదిహేను వేల రూపాయలకి డ్రాఫ్టు పది పదిహేను రోజులలో పంపిస్తాను.

మరో విషయం — ఈ కోర్టు, కేసులు, ఆర్గ్యుమెంట్లు నాకు విసుగొస్తోంది — అలాగని మానేసి యింట్లో కూర్చున్నా కాలక్షేపం కాదుకదా. నీ ఫ్యాక్టరీలో, అదే మన ఫ్యాక్టరీలో నేను నిర్వహించగలిగిన పని యేదైనా వుంటే ఎంతో సంతోషిస్తాను. వెంటనే జవాబు వ్రాయి.

నిరంజనం.'

ఉత్తరం కవరులో పెట్టి ఎడ్రసు వ్రాసి అప్పటికప్పుడు వెళ్ళి పోస్టుచేసి వచ్చాక అతని మనస్సు యెంతో తేలికయింది. రాత్రంతా కంటిమీద కునుకు లేకపోవటంవల్ల నడుం వాల్చగానే హాయిగా నిద్ర పట్టింది.

ఆవేశం క్రమంగా చల్లబడటంతో వివేకం మేల్కొంది సుధలో. తను చాలా నీచంగా మాట్లాడాననే భావం ఆ అమ్మాయిలో చోటు చేసుకోటం ప్రారంభించింది.

మనిషికి కోరికలు, ఆశలు వుండటంలో తప్పులేదు. అవి సక్రమమైన పద్ధతిలో తీర్చుకోటంలో అంతకన్నా తప్పులేదు — కాని తను చేసిందేమిటి — తను అడిగిన దానికి భర్త కాదన్నాడనే కోపంలో వళ్ళు తెలియకుండా ఇష్టం వచ్చినట్లు ఏదేదో వాగేసింది — ఆ కాంతమ్మ ఎంత దుర్మార్గురాలో తనకి తెలుసు. తమ ఇంట్లోంచి వెళ్ళిపోయిన తరువాతకూడ ఆవిడని గురించి కథలు వింది తను. అలాంటి మనిషి చెప్పిన మాట పట్టుకుని, తన భర్తకి తండ్రిపట్లగల గౌరవం, భక్తిభావం సడలించటమే తన ఆశయం అన్నట్లుగా ప్రవర్తించింది.

అంతకంతకూ పెరిగిపోతూ గుండెల నిండా ఆక్రమించుకుంటున్న బాధ, పశ్చాత్తాపం మౌనంగా భరించటం సుధకు శక్యం కావటంలేదు.

నిత్యకృత్యాలకి ఎలాంటి లోపం లేకుండా సాయంకాలం ఫలహారంఅయింది. భర్తవెంటే గదిలోకి వెళ్ళింది సుధ — శోకదేవతలా వున్న భార్య మొహం చూసినా అతని మనస్సు కరగలేదు. తలవంచుకుని చేతిలోకి పుస్తకం తీసుకున్నాడు. కుర్చీ వెనక నిలబడిన సుధ అతి మెల్లిగా మాటలు కూడబలుక్కుంటున్నట్లు — 'ఆ కాంతమ్మ చెప్పింది వేనెప్పుడూ నమ్మలేదు; ఆవిడంటే నా కెలాంటి సదభిప్రాయం లేదు — ఆవేశంలో యేదో అనేశాను. నన్ను క్షమించండి' అంది.

చివ్వున తలతిప్పి నిరసనగా భార్య కళ్ళల్లోకి క్షణం చూసి మొహం తిప్పేసుకున్నాడు మధు. 'చిచ్చు రగిల్చి, ఇప్పుడు నీళ్ళు చల్లటానికి వచ్చావా' అన్న భావం వ్యక్తం అయింది సుధకి ఆ చూపులకి తట్టుకోలేక ఆపాదమస్తకం కంపించిపోతూ ఆసరాకోసం కుర్చీ గట్టిగా పట్టుకుని అలాగే నిలబడింది కొద్ది క్షణాలు. మధు ఏం మాట్లాడలేదు — గత రాత్రి సుధ మాటలలో యే కొన్ని అయినా తండ్రి వినటం జరిగివుంటే పర్యవసానం ఎంత దారుణంగా వుంటుందో వూహించటానికి కూడ అతనికి భయంవేస్తోంది — తప్పులు చెయ్యటం, ఆపైన క్షమార్పణ కోరుకోటం అదో గొప్ప పనా — మాటలు పెంచి మళ్ళీ గొడవ చెయ్యటం యిష్టంలేక పుస్తకం పుటలు తిరగేస్తూ కూర్చున్నాడతను — ఇంక యేం మాట్లాడాలో తెలియక సుధ కూడ లోపలికి వెళ్ళిపోయింది.

నాలుగురోజులు గడిచాయి. ఈ నాలుగు రోజులలోనూ నిరంజనం కొన్ని ఏర్పాట్లు చేశాడు. అవాళ తప్పకుండా మూర్తి దగ్గరనుండి ఉత్తరం వస్తుందని అనుకున్నాడు. అలాగే వచ్చింది.

'డియర్ నిరంజనం,

నీ ఉత్తరం చూసి మేమెంతో సంతోషించాం. కావలసిన పెట్టుబడిని సర్దటానికి వెంటనే అంగీకరించటమే గాకుండా నీ అంతట నువ్వు ఫ్యాక్టరీ విషయాలు చూస్తాననటం మా కెంతో ఉత్సాహంగా వుంది. ఇంక లీగల్ మేటర్సులో మేం నిశ్చింతగా వుంటాం — నీవు వీలయినంత త్వరలో వచ్చేసెయ్. అన్ని విషయాలు ఇక్కడే మాట్లాడుకుందాం — ఆఫీసు అను

దిగ్విజయం అవుతుంది.

మూర్తి.'

నిరంజనం మనస్సు ఈమధ్య కాలంలో ఎన్నడూ లేనంత సంతోషంగా, హాయిగా వుంది.

సాయంకాలం కాఫీ ముగించి, గదిలోకి వెళ్తూ, 'ఓ సారిలా రా మధూ' అని పిల్చాడు.

'కూర్చో' అంటూ కుర్చీ చూపించి తనో కుర్చీలో కూర్చున్నాడు. డ్రాయరు సొరుగు లాగి కాగితాల కట్ట తీసి కొడుకు చేతిలో పెట్టాడు.

తండ్రి ఏం చెప్పటానికి పిల్చాడో అర్థం చేసుకోలేక తెల్లబోయి చూస్తున్న మధు, ఆ మడత విప్పుతూనే త్రాచు పాముని చూసి బెదిరినట్లు బిత్తరపోయి 'ఇదేమిటి విల్లు వ్రాశారా, ఇప్పుడు దీని అవసరం ఏమొచ్చింది' అన్నాడు.

'ఎప్పటికి దేని అవసరం వస్తుందో మనం ఏం చెప్పగలం — ఏర్పాట్లన్నీ ముందుగా చేసుకుంటే మంచిదనితోచింది. ఇలా చేశాను — చూడు, నీకు తెలుసుగా, ఈ డాబా కట్టినప్పుడు మీ అమ్మమ్మ కూడ కొంచెం డబ్బు ఇచ్చారు. అది ఎలాగా మీ అమ్మకి చెందాల్సిందేననుకో— అది మీ కిద్దరికీ ఇమ్మని వాళ్ళు చెప్పారు. అందుకే ఆరువేల రూపాయలు వసూ కిస్తున్నాను. ఈ ఇల్లు అయిదెకరాల పొలం—నీకు, ఇవి కాకుండా, పదిహేనువేలరూపాయలు ఓ షుగర్ ఫ్యాక్టరీలో ఇన్వెస్టు చేస్తున్నాను. ఆ తరువాత ఆ షేర్లు నీకు వసూకి...'

ప్రాణంవులా కూర్చుండిపోయిన మధు అప్పటికి నోరు విప్పగలిగాడు.

'విల్లు వ్రాయటమే కాకుండా ఈ విషయాలన్నీ మీ రిప్పుడు నాకు ఎందుకు చెపుతున్నారు...డబ్బు విషయంలో ఏనాడయినా నేను జోక్యం కలిగించుకున్నానా?' ఆ కాగితాలతో తనకి అవసరం లేదన్నట్లు టేబిలుమీద పెట్టేశాడు—తన మొహం నిండా పరుచుకుంటున్న భావాలు తండ్రి కంటబడకుండా లేచివెళ్ళి కిటికీ దగ్గర నిలబడ్డాడు. కాని అతని మనస్సు నిరంజనానికి అప్పటికే అవగతం అయిపోయింది. కొడుకు బాధచూస్తే అతనికీ కష్టంగానే



భుజాలమీద అభిమానంగా చేయి వేశాడు.

'మరేంలేదు బాబయ్యా, నాకు ఈకోర్టుకి వెళ్ళటం కేసులు వాదించటం అదీ చాలా చిరాగ్గా వుంది — ఈ బాదరబందీ ఏం లేకుండా ఓ దగ్గర కూర్చుని చూసుకునే పనేదయినావుంటే బాగుండు ననిపించింది— అనుకోకుండా నా ఫ్రెండొకడు ఆ అవకాశం కల్పించాడు...'

తృళ్ళిపడ్డాడు మధు. తను భయపడినంత జరిగిందన్నమాట దాని ఫలితమే ఇది అని ఒక్కక్షణంలోనే అతనికి అర్థం అయిపోయింది.

'మీరు మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోవాలనుకుంటున్నారా! ఊహూ వీల్లేదు. మా అవిధేయతకి అపరాధానికి మీరు ఇంత కఠినమైన శిక్ష విధించటం

జరిగినదానికి నే నెంతో బాధపడుతున్నాను...' అతని గొంతులో సుడులు తిరుగుతున్న దుఃఖమూ బాధా నిరంజనం హృదయం ఆర్ద్రమయేలా చేశాయి. ఒక్కక్షణంలో తనని తను అదుపులోకి తెచ్చుకుని కొడుకుని ఓదార్చబోయాడు: 'ఇప్పుడంతా ఎందుకు బాబయ్యా మళ్ళీ తలుచుకోడం?'

మధు బాధగా కిటికీ వూచలకి తల ఆనించి అరచెయ్యి కళ్ళకి అడ్డం పెట్టుకుని కుళ్ళికుళ్ళి ఏడ్చాడు— 'కొత్తగా తలుచుకోటం ఏమీలేదు. అహర్నిశలు ఆ సంఘటన నా హృదయాన్ని రగిలిస్తూనే వుంది — మిమ్మల్ని క్షమించమని అడిగే అర్హతనికూడ మేం పోగొట్టుకున్నాం. అయినా మిమ్మల్ని అర్థిస్తున్నాను. నన్నే కాదు, మంచీ చెడూ ఆలోచించకుండా నోటికివచ్చినట్లు మాట్లాడిన సుధని కూడ క్షమించమని నేను కోరుకుంటున్నాను—జరిగిపోయినదానికి తనూ పశ్చాత్తాపపడుతోంది—ఉండండి తనని తీసుకొచ్చి మీ పాదాలమీద పడేస్తాను...'

బాణంలా దూసుకుపోతున్న కొడుకు భుజం గట్టిగా పట్టుకుని ఆపాడు—

'ఏమిటీ వెర్రి. నేనేం అలిగి వెళ్ళిపోతున్నాననుకున్నావా...'

'అలగటం కాదు, అవమానం భరించలేక వెళ్ళిపోతున్నారు — లేకపోతే ఇన్ని సంవత్సరాలు స్వతంత్రంగా గడిపిన మీరు ఇవాళ ఎవరిచేతిక్రిందో జీతానికి ఉద్యోగం చేస్తాననటం...'

'ఒకరిచేతిక్రింద పనిచేస్తున్నాననే మాటే లేదు—అందులో నేనూ వాటాదారునే. అదీ స్వంతపనే—చెప్పానుగా. ఇన్నాళ్ళనుండీ చేస్తున్న ఈ పని ఏమిటో డల్‌గా వున్నట్లనిపించింది — ఛేంజ్ ఏదైనావస్తే బాగుండును అనుకుంటున్న సమయంలో అతని ఉత్తరం వచ్చింది...'

'మీ రెన్నయినా చెప్పండి. మీరు వెళ్ళిపోవటానికి మాత్రం నే నొప్పుకోను— కోర్టుకి వెళ్ళాలని లేకపోతే హాయిగా యింట్లో విశ్రాంతి తీసుకోండి—లైఫ్ డల్‌గా అనిపిస్తుంటే ప్రతి శలవల్లోనూ ఎక్కడికయినా వెళ్ళివస్తుందాం. మిమ్మల్ని



సంతోషపెట్టటానికి నాచేత నయినదంతా చేస్తాను—ఈ వయస్సులో మీరు ఒక్కరూ ఎక్కడో తంటాలు పడటంమాత్రం నేను భరించలేను '

'నేనేం దేశం కాని దేశం వెళ్ళటంలేదు —ఒంట్లో ఈమాత్రం శక్తి వున్నప్పుడే ఏదయినా చెయ్యగలుగుతాను. అది పూర్తిగా ఉడిగిపోయిననాడు నీ దగ్గరికి రాక ఎక్కడికి పోతాను?' కొడుకుని ఓదార్చటానికి ఆమాట అన్నాడే కాని, పని పాటలు చేసుకునే శక్తి పూర్తిగా ఉడిగిపోయేదాకా తను బ్రతికివుండటమే సంభవిస్తే అలాంటి సమయంలో ఏ ఆశ్రమంలోనో నివాసం ఏర్పరచుకొని దైవచింతనలోనే శేషజీవితం గడపాలని అతను నిశ్చయించుకున్నాడు.

తండ్రి కళ్ళల్లోకి దిగులుగా చూశాడు మధు. 'మీ నిర్ణయానికి తిరుగులేదా? అన్నదమ్ములే విడిపోవడానికి ఎంతో బాధ పడతారు. ఉద్యోగంకోసం కొడుకు మరో దగ్గరికి వెళ్తానంటేనే బాధపడే తల్లిదండ్రులుంటారు అని చెప్పిన మీరు...'

నిరంజనంమనస్సు విలవిల్లాడిపోయింది. ఏం చెప్తాడిప్పుడు తను. 'ప్రేమాభిమానాలకి కూడ ఒక పరిమితి వుండాలి. అవి ఎదుటిమనిషి భవిష్యత్తుకి ఎంత మాత్రం అవరోధం కాకూడదు.' గబుక్కున అనేసిన అతను,

'చూడు, నాకు అక్కడ హాయిగా వుంటుంది—నీకు ఈ వూళ్ళో ప్రోస్పెక్ట్సు ఏమీలేవు. హాయిగా మరో మంచి ఉద్యోగానికి ప్రయత్నించు' నువ్వు అభివృద్ధిలోకివస్తే చూసి గర్వపడటం కంటె నా కింకేంకావాలి చెప్పు.' అన్నాడు పెదవులమీదికి చిరునవ్వు తెచ్చుకుంటూ.

మధు బాధగా నిశ్వసించాడు. 'నేను పోగొట్టుకుంటున్నదాంతో పోల్చిచూస్తే, ఆ భవిష్యత్తు గడ్డిపోచతో సమానం నాకు.

'ఇవాళ నేను చాలా విషయాలు తెలుసుకున్నాను—ఒక్కోమనిషి చేసిన త్యాగానికి ప్రతిఫలం ఏమీ దొరకదు—పొందిన ఉపకారానికి కృతజ్ఞత చూపించుకోటానికి కూడ శక్తి వుండదు కొందరికి—నన్ను చెప్పనివ్వండి—

ప్రేమాభిమానాలు ఎదుటిమనిషి భవిష్యత్తుకేకాదు మరొకరి మనశ్శాంతికి కూడ ప్రతిబంధం కాకూడదు—మీరు చేసిన త్యాగానికి కృతజ్ఞత చూపించుకోగలుగుతున్నాననే నా సంతోషంకోసం, కొడుకుగా నా ధర్మం నెరవేర్చుకోగలుగుతున్నాననే నా తృప్తికోసం మీ హృదయానికి శాంతి అనేది లేకుండా చెయ్యటం న్యాయంకాదు. హాయిగా పీల్చుకోవలసిన వూపిరికూడ నిప్పుసెగలా తగులుతూంటే భరించటం ఎవరికయినా కష్టమే—ఎక్కడయినా మీరు శాంతిగా విశ్రాంతిగా వుండటమే నేను కోరుకుంటున్నాను.

'కాని ఒకందుకు మాత్రం నాకు చాల బాధగావుంది. ఎప్పుడూ కూడ ఇతరుల కోసం మీ జీవనవిధానాన్ని మార్చుకోటంతోనే సరిపోయింది.'

'నేను మార్చుకోటం ఏమిటి. ఒక్కొక్కరి జీవితమే అంత — తలుచుకుంటేనే ఊపిరి సలపక ఉక్కిరి బిక్కిరి అయేలాంటి పరిస్థితులు వాళ్ళకి అడుగడుగునా ఎదురవుతుంటాయి. వాటికి అనుగుణంగా నడుచుకోటంకంటె మరో మార్గంలేదు. అప్పటికీ వారికి శాంతి కరువే అవుతుంది—ఎంత శ్రావ్యంగా ఆలపించాలని ప్రయత్నించినా వారి జీవనరాగంలో అపశృతులు అపస్వరాలు పలుకుతూనేవుంటాయి.' అనుకున్న నిరంజనం వళానంగా కొడుకు భుజాలచుట్టూ చేయివేసి దగ్గరికి తీసుకున్నాడు. ఇద్దరి కళ్ళల్లోనూ నీళ్ళు నిండివున్నాయి. (అయిపోయింది) ●

# బాతాఖానీ - బాగోగులు

విదేశీయులు వ్రాసే పుస్తకాల్లో ముఖ్యంగా మనమీద చేసే విమర్శ మనకి కాలాన్ని గురించిన పట్టింపు లేదని. ఆధునిక యుగంలో ఈ కాలానికి వున్నవిలువ యింతా అంతా కాదు; అయినా సరే మనకి కచ్చితంగా ఫలానా తేదీ, ఫలానాగంట అని ప్రతిపనికీ నిర్ణయించుకోటం, యిచ్చిన మాటకి కట్టుబడి వుండటం అలవాటులేదు. దర్జీవాడికి బట్టలు కుట్టటాన్కి యిచ్చి, 'ఎప్పుడిస్తావు ?' అంటే, 'వచ్చేవారంలో' అంటాడు. ఫలానారోజు అని చెప్పడు; చెప్పినా యివ్వడు. చాకలివాడూ యింతే; యింతెందుకూ, నిత్యజీవితంలో మనకి కావల్సిన ప్రతీవాడూ యింతే. మనకి బాగా అలవాటయిపోయి ఆదోచిత్రంగానూ ఎబ్బెట్టుగానూ తోచదుకానీ, యితరులకి అంటే విదేశస్థులకి ప్రాణసంకటంగా, చాలా యిబ్బందిగా వుంది. ఈ దేశంలో వున్న మా విదేశీ మిత్రులు కొందరు నవ్వుతూ ఈ విషయాన్ని విమర్శిస్తుంటే, 'నిజమేస్మీ !' అన్పించింది. వాళ్ళు ముందుగా నిర్ణయించుకోనిదే ఎక్కడికీ వెళ్లరు; మనం ఆహ్వానిస్తే తప్ప బాతాఖానీ కోసం రారు. మా విదేశ మిత్రుల్ని పిలిస్తే, 'ఎన్నిగంటలకి రమ్మంటారు ? ఎన్నిగంటలవరకూ వుండవచ్చు ?' అని కచ్చితంగా నిర్ణయించుకొని వచ్చేవారు. ఆ వ్యవధి అయిపోగానే సెలవు తీసుకోటం వారికి పరిపాటి.

కానీ మనవాళ్ళు చాలామంది ఎప్పుడు పడితే అప్పుడు వచ్చి, ఎంతరాత్రయినా కదలరు. యివతలివాళ్ల కష్టసుఖాలు గమనించకుండా పల్లెటూళ్లో రచ్చబండ బాతాఖానీలాగా ఫ్లాట్లల్లో కుదుర్తుందా ? ఉదయం 8 నుంచి సాయంత్రం 6 గంటలదాకా వుద్యోగం చేసి, ఈతిబాధలు, బజారు, రేషన్ వగైరాల్లో సతమతమైపోయి, అలసిపోయి యింటికి వచ్చిన వ్యక్తి కాస్త ఊపిరి పీల్చుకోవాలి అన్న జ్ఞానం వుండదు. ముఖ్యంగా కొందరు బ్రహ్మచారులు, 'కుటుంబరావు'ల ప్రోబ్లెమ్స్ తెలుసుకోకుండా, ఆఫీసునుంచి తిన్నగా 'కుటుంబరావు' గారితో కలిసి వారింటికి వచ్చేయటం సోఫాలో బైఠాయించి, రాత్రి పదిగంటలదాకా కదలకపోవటం. మాకో మిత్రుడున్నాడు. రోజూ విధిగా 'హాజరు' వేయించుకుంటాడు; మేమిద్దరం వుద్యోగాలుచేసి సాయంత్రం వచ్చేక, కాసేపు కబుర్లు చెప్పుకోటాన్కి, యిష్టం వచ్చిన రికార్డ్స్ వేసుకోటాన్కి, పత్రికలు చదవటాన్కి వ్యవధి నివ్వకుండా, ఇహ ఆదివారం వచ్చిందంటే మాకు భయం ఉదయం 8 నుంచీ ఒంటి గంటవరకూనూ సాయంత్రం ఐదునుంచిరాత్రి పది వరకూనూ బోరటం. అతన్ని పంపించటాన్కి శతవిధాల ప్రయత్నించినా, ఊహూఁ లాభంలేదు 'ఎంతైందండీ 'టైమ్?' అంటే 'అబ్బే ఏదీ యింకా 9 గంటలైనా కాందే!' అని సమాధానం. 'మీరు రాత్రికి వంట చేసుకోవాలి 'కాబోలు' అని సున్నితంగా వెళ్లమని ధ్వనింపచేస్తే, 'వుదయమే చేసేశాను,' అని నిబ్బరంగా కూచుంటాడు.

ఇంకో బాపతు, వచ్చేక వూర్కే కూచోరు. సర్దిపెట్టిన మేగజైన్స్‌ని చిందరవందర చేయటం, వినకపోయినా రేడియోని అదేపనిగా తిప్పటం, టేబిల్‌లైట్‌ని వెలిగిస్తూ, ఆర్పుతూ, ఆడటం, పంచింగ్ మెషీన్, స్టేప్లర్‌లాటి వస్తువులుంటే వాటిపని పట్టించటం లాటి కోతిచేష్టలు చేస్తారు. పసిపిల్లలు చేస్తేనే యిలాటి పన్లు సహించలేం. దీనికి కారణం యిలాటి మిత్రులకి కావల్సినంత పనిలేక పోటమే. ఒకరిళ్లకివెళ్లి వాళ్లకి విసుగు, చికాకు కల్గించకుండా యింట్లో కూచుని, పుస్తకాలు చదువుకోటమో ఓ హాబీ అలవర్చుకోటమో మంచిదికాదూ ?

ఇక సిగరెట్స్ కాల్చేవాళ్లయితే, కూచుని కబుర్లాడుతూ పెట్టెలకి పెట్టెలు ఖాళీ చేసేస్తారు నిర్మొహమాటంగా, అందులో యిటీవల సిగరెట్లధర పెరిగేక వాళ్ళు కొనుక్కోకుండా యితరులమీద ఆ బరువు కాస్త పడేస్తున్నారు. కొందరికి చక్కని సంభాషణా చాతుర్యం వుండదు. సంగీతం, సాహిత్యం, ప్రస్తుత రాజకీయాలు—ఏవీ తెలీవు. కీలుగుర్రం, బాలరాజు సినిమా కబుర్లు పదిహేనేళ్లనాటి పాత సంగతులు చెప్తారు. వచ్చిన అతిథిని అవమానపర్చంగద ! గరళం మింగినట్టు విని తీరాల్సిందే. మరో మిత్రుడున్నాడు. ఆయన మంచివాడే కానీ, ఆయన సంభాషణలో 'నేను' అన్న పదానికి వున్నస్థానం 'నీవు'కి లేదు. 'నేను శాంతినికేతన్‌లో వున్నప్పుడు, నేను కాశ్మీర్ వెళ్లినప్పుడు, నాకు హార్ట్ ఆపరేషన్ అయినప్పుడూ......' అంటూ వారి జీవితంలో కొన్ని ప్రముఖ ఘట్టాలున్నాయి. నిజంగానే ఆసక్తితో విన్నాం తొలిసారి, మలిసారి. మళ్లీమళ్లీ అవేకథలు ఎన్నోసార్లు రిపీట్ చేస్తే ఏం చెయ్యటం ? ఈ జబ్బు ఫారిన్ వెళ్లినవాళ్లలో కొందరికి మరీ యెక్కువ. ఎంతైనా మనందరం సాధారణ మానవులం కదా ! మహానుభావుల జీవితాధ్యాయాలు పదేపదే చదవం కదా. సర్వసాధారణమైన కబుర్లు ఎంత కని వినటం ? ఆలిండియా రేడియోలో దుర్యోధనుడి ఏకపాత్రాభినయం తాలూకు వాక్చిత్రం విన్నట్టు ! ఎటొచ్చీ రేడియోని 'ఆఫ్' చెయ్యగలం కానీ వీళ్ల నోళ్లు మూయమనటాన్కి సంస్కారం అడ్డొస్తుంది.

మరికొందరు ఇంటికొచ్చిందే తడవు 'జూక్ బాక్స్'లో రికార్డెంచుకున్నట్టు, 'ఫలానా రికార్డు వెయ్యండిసార్.' అనటం సమయం సందర్భం లేకుండా. ఎంచుకున్న పాటైనా వింటారా, అంటే అదీలేదు, 'సినిమా పాటలకన్న శాస్త్రీయ సంగీతం నా కిష్టం,' అని తన సంస్కారాన్ని ప్రదర్శించటం. మళ్లీ ఈ మహానుభావులకి త్యాగరాజు ఏ భాషలో రాశాడోకూడా తెలీదు. హెండల్, బీథోవెన్‌ల పేర్లయినా విని వుండరు. ఏదైనా భరించి తీరాలి. ఇంకొంతమంది మిత్రులు చక్కగా రీడింగ్ రూంలోలాగే, ఫ్యాన్ వేసుకుని సోఫాలో

జారపడి, వారపత్రికలు, మాసపత్రికలు పఠించటం ప్రారంభిస్తారు; పత్రికలు కొనరు. దేశంలో తెలుగు రెండో భాషయినా, మన పత్రికల సర్క్యులేషన్ వెనకబడి వుండటానికి కారణం పయిదే అనుకుంటాను. ప్రతితమిళుడు 'కల్కి', 'ఆనందవికటన్' కొనుక్కుంటాడు. ఒక్క ఆంధ్రపత్రిక ఒకవూరి ఆంధ్రులందరు సర్దేను కుంటారు. పుస్తకం తిరిగి యివ్వమనటం కూడా మహాపరాధమే, ముఖ్యంగా తెలుగు వాళ్ల దృష్టిలో. 'తెచ్చివ్వాలంటారా?' అని అర్థంలేని ప్రశ్న వేస్తారు.

ఈ భాతాఖాని రాయుళ్ల బారినుండి తప్పించుకోటానికి బజారుకో, పార్కుకో బయలుదేరితే, వాళ్ళూ మనవెంటే వుండి తిరిగివచ్చి, రాత్రి 11 గంటలవరకూ వక్షీతోసహా బిడ్ఖు పట్టించేస్తారు. ఆవలింతలు తీసినా, ఆముదం పట్టించేస్తున్నావు బాబూ అని ముంజేయిని రుద్దుకున్నా టైంపీస్‌ని వారి ఎదురుగా వుంచినా—ఊహూ అర్థం అవదే. మా అతి వినువువల్ల అవతలి వ్యక్తులకి హాయివుండదు కదా, ఉక్కిరి బిక్కిరిగా వుంటుంది. ఇలా టొత్తిగా వ్యక్తిగత జీవితానికి విలువనివ్వక పోవటం, 'ఏకాంతతని'ని నాశనం చెయ్యటం నాగరిక లక్షణం కాదు. ఒకవ్యక్తి వస్తున్నాడూ అంటే, తొలకరి జల్లుకోసం ఎదురుచూసినట్లూ, మళ్లీ పిల్పించు కునేట్లూ వుండాలి రాకపోకలు. సంభాషణ అందరికీ సంబంధించినదీ, గొప్పలూ, కోతలూ కాకుండానూ, చమత్కారంగానూ వుండాలి. అంతేకానీ మన గొప్పలెవరి క్కావాలి? కొంచెం స్థూలంగా ఆలోచించాలి. మా స్నేహితురాలొకావిడ వచ్చిం దంటే గాలీవాన వచ్చినట్లే, 'మా అమ్మాయి కాన్వెంట్‌లో చదువుతోంది; వీణ నేర్పిస్తున్నాం, భరతనాట్యం నేర్చుకుం టోంది! మా అబ్బాయిలేడూ వట్టి ఆకతాయి, ఇరవైనాలుగ్గంటలూ, స్క్రూ డ్రైవర్లూ, కత్తులూ, బ్లేడులూ, మేకులూ, సుత్తులూ పీటితోనే ఆట. మెకానికల్ యింజనీరయ్యేట్టున్నాడు,' ఇదీ ధోరణి. నిజానికి మెకానికల్ యింజనీర్ అవుతాడో, మెకానిక్ అవుతాడో ఎవరికి తెలుసు! నిజంగానే ప్రతీ తల్లిదండ్రులకి వారి పిల్లలు అమోఘమైన తెలివిగలవాళ్లలాగే కన్పిస్తారు. రకరకాల కోరికలు, ఆదర్శాలు వుంచుకోటమూ సబబే; ఎటొచ్చీ యితర్లని బాధించటం మాత్రమే సబబు కాదు. ఇలాంటివి మనసులో వుంచుకోవాల్సినవి. హెరాల్డ్ విల్సన్‌కి చిన్నప్పుడు, వాళ్లనాన్న నంబర్ టెన్ డౌనింగ్ స్ట్రీట్ దగ్గర నుంచోబెట్టి ఫోటోతీశాడు. ఆ పిల్లవాడు పెద్దయి తండ్రి ఆ కాంక్షను తీర్చగలిగేడు బ్రిటిష్ ప్రధాన మంత్రయి. అంతా అలా వుండరుగదా! కొంతమంది స్త్రీలు ముఖ్యంగా ఈ గొప్పలు గమ్మత్తుగా చెప్తారు. అవతలివాళ్లు వెర్రివాళ్లయినట్లు. 'మూడు రూపాయిలు కిలో చొప్పున ఓ బస్తాడు బియ్యం కొనేశాను, వెధవవి పిల్లల బిస్కట్లూ, టాఫీస్ వందరూపాయ లైంది ఈ నెల్లో;' ఈ వరసన ఎన్ని కోతలు కోస్తారో చెప్పలేం.

నిష్కారణంగా యిలాటి కబుర్లాడుతూంటారు. దానివల్ల ప్రయోజనం సున్న; ఫలానా ఆయన లేక ఆవిడ వస్తున్నారూ అంటే, యిల్లొదిలి వెళ్లటమో; లేక నాజీలకి భయపడి దాగున్న ఆన్‌ఫ్రాంక్ కుటుంబంలాగ కిక్కురుమనకుండా వెనక గదిలో కూచొని ఆపద తప్పించుకోటమో చెయ్యాలి. ఇల్లన్నాక, అతిథి అభ్యాగతులూ, స్నేహితులూ వుంటారు; కాదనను కానీ ప్రతీ దానికీ ఓ హద్దంటూ వుండాలి. అందులోనే వుంది కిటుకంతానూ. వస్తూ పోతూం డటం, నలుగురితో పరిచయం, స్నేహం అవసరమే; అది తగు పదునులో వుండాలి. పిలిస్తే తప్ప అనవసరంగా వెళ్లటం సాధ్యమైనంతవరకూ మానాలి. పోనీ వెళ్లాలన్పించినప్పుడు కాస్త ఆ గృహస్థుకో, గృహిణికో తెలియజేసి పరిమితమైన వ్యవధిలో తిరిగి వచ్చేస్తే వాళ్లకీ, వీళ్లకు కూడ మంచిది. కానీ గృహస్థు తాలూకు కుటుంబానికి యిబ్బంది కలుగజేస్తూ వాళ్ల పనిపాటలకి అడ్డుపడుతూ, యిరుకున పడేయటం భావ్యంకాదు. అన్నింటినీ మించి, డబ్బు కంటే విలువైన మన కాలాన్నీ, యితరుల కాలాన్నీ వ్యర్థపరచటం సరైన పనికాదు.

# డాక్టర్ కబుర్లు

## పొంగుకి వాక్సిన్

ఇప్పుడు అమెరికాలో రెండురకాల పొంగు వాక్సిన్‌లు ఇస్తున్నారు. ఒకటి 'బతికిన వయిరస్' కలది. రెండవది 'చచ్చిన వయిరస్' కలది. రెండిటినీ ఇవ్వవచ్చు. అమెరికా ఆహారశాఖ వారు మాత్రం మొదటిరకం మెరుగు అంటున్నారు. వాక్సిన్ ఇంజక్షన్ ఇవ్వగానే కొద్దిగా పొంగు ఎంటిది వస్తుంది. ఇది అంటువ్యాధి కాదు. డాక్టర్లుమాత్రం వాక్సిన్‌తోబాటు పొంగుకి లొంగిని గ్లొబ్యులిన్ ఇంజక్షన్ కూడా ఇస్తూ ఉంటారు. దీనివల్ల జ్వరం, దగ్గు, తలనొప్పి, జలుబు మొదలయినవి రవు.

'బతికిన'రకం వాక్సిన్ ఇస్తే ఎక్కువ కాలం రక్షణ ఉంటుంది— కొందరికి జీవితాంతం! 'చచ్చిన వయిరస్' రకం వాక్సిన్ ఒక సంవత్సరంకన్నా రక్షణ ఇవ్వక పోవచ్చు.

కడుపుతున్న వారికి 'సజీవక్రిముల' వాక్సిన్ ఇవ్వడం మంచిదికాదు. గుడ్డపడని వారికికూడా ఇవ్వటం మంచిదికాదు. పెద్ద జబ్బు 'ఏదంయినా ఉన్నవారి విషయంలోనూ అంతే. ఎక్స్—రే, కార్టిసోన్ మందుల చికిత్స పొందుతున్నవారికి కూడా ఇవ్వరు.



సహజంగ వచ్చే పొంగు ప్రమాదం లేనప్పుడే ఇవి ఇవ్వాలి. ఒడికి వెళ్లే ముందే పిల్లకి ఇవ్వడం మంచిది.

హెచ్. ఎల్. హెర్షన్‌సోన్,

(కాపీరయిటు)

# పొరుగును ప్రేమించు!




కె. రామలక్ష్మి

'నీ పొరుగువాణ్ని ప్రేమించు' అన్నది క్రీస్తువారు చెప్పిన బ్రహ్మసూత్రాలలో ఒకటి! కాని సర్వసాధారణంగా పొరుగు వాళ్ళమీద నేరాలు చెప్పేవాళ్లే ఎక్కువగా కనిపిస్తారు. 'నే కాలు కదిపితే తనకి కావాలి' 'నే ఏం వండినా తనకి చెప్పాలి ఇలాంటి పొరుగావిడ నెలా భరించడం?' అంటూ వాపోతూ ఉంటారు కొందరు సోదరీమణులు ముఖాలు ఎదురైతే చాలు చెండుకునేటంత పొత్తుగా ఉంటూ ఉంటారు కొందరు గృహిణులు నిజమే, ఇరుగు పొరుగులతో కొన్ని ఇబ్బందులు లేక పోలేదు. పొరుగు అయాక ప్రోబ్లమ్స్ కాక తప్పదేమో అనిపిస్తుంది కూడాను.

తెల్లారింది మొదలు—కాఫీ పొడికి, పంచదారకి, ఉప్పుకి పప్పుకి అంటూ అలా ఆ గుమ్మంలోంచి ఈ గుమ్మంలోకి తిరుగుతూనే ఉండే పక్కావిడ బారినుండి ఎలా తప్పించుకోవడమో అర్థం కాక వాపోతుంది ఒకామె. పక్కగోడ దగ్గరో, పెరటి గుమ్మందగ్గరో నిలబడి గంటల తరబడీ కాలు కదపనీయకుండా చొప్పదంటుగా వాగే మనిషికి కంట పడకుండా ఎలా తిరగడమో తెలియక తికమక పడుతుంది మరొకావిడ. ఇలాంటి వాళ్లకి టైము లెక్కలేదు, మనం ఒకవేళ లోపలికి వెళ్లిపోయినా. — 'పిన్నిగారూ!' — అనో, వదినగారూ! అనో వరలక్ష్మిగారూ అనో కేకలు వేస్తూనే ఉంటుంది ఇల్లాలు. ఏదో వార్త చెప్పాలని తహ తహ లాడిపోతుంది. ఇంకో రకం ఆవిడ ఉంటుంది: అడిగినా అడగక పోయినా సలహాలు పారేస్తూ ఉంటారు. గృహ వైద్యాలు సూచిస్తారు. పిల్లల్ని ఎలా పెంచాలో చెప్పేస్తూ ఉంటారు. చెప్పి ఊరుకోరు. పాటించక పోతే కోపం తెచ్చుకుంటారు. మాట్లాడ్డం మానేస్తారు. 'ఆ పక్కింటి' పిన్నిగారితో 'ఈ పక్కింటావిడ' కెంత గర్వమో చిలవలూ పలవలూ అల్లి చెప్తారు.

ఇరుగు పొరుగుల్ని గురించి ఇంత ఎక్కువగా ఎందుకు అందరూ ఆలోచిస్తున్నారు? అని ప్రశ్నించుకుంటే— ఒక సత్యం తెలుస్తుంది. ఇరుకు సమస్యల నుంచి చిన్న చిన్న తల నెప్పులనుంచి పొరుగువారితో ఘర్షణ పడకుండా ఎలా తప్పించుకోవాలని తలపోయడంలోనే దాగి ఉంది—ఇరుగు పొరుగులతో 'మంచిగా' ఉండాలన్న కుతూహలం, అదెలాగన్నదే అసలు గొడవ.

ఏ ప్రమాదమో, రోగమో, జరిగినప్పుడు వచ్చినప్పుడుగాని ఇరుగు పొరుగుల మంచితనం బయటపడదు. ఇంట్లో ఏదైనా కష్టం వచ్చినప్పుడు తక్షణం నడుం కట్టి సహాయానికి వచ్చేది. అప్పులకని వచ్చే పొరుగింటావిడే, సమయా సమయాలు చూడకుండా కబుర్లాడే ఆవిడే, కష్టంలో కొండంత ధైర్యం చెప్పి పక్కన నిలబడుతుంది. ఇరుగు పొరుగులు ఒకరి నొకరు అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తే అసలు సమస్యే ఉండదు. ఆ వ్యక్తి అసలు తత్వం ఎలాంటిదని గ్రహించే ప్రయత్నం చేయాలి గాని ఏదో అవసర సమయాలలో ఆమె ప్రవర్తననే కొలబద్దగా పెట్టుకో కూడదు. మంచి స్నేహితులు పక్కన ఉంటే జీవితం నిండుగా ఉన్నట్టుంటుంది. ధైర్యంగా కూడా ఉంటుంది. అందుకే పొరుగువారితో స్నేహం పెంచుకునే ప్రయత్నం చేయాలేగాని తెగ తెంపులుగా ఉండకూడదు. మన్ని విసిగిస్తుందన్నావిడే మనం ఎక్కడికేనా వెడితే పాలు పుచ్చుకుంటూ ఎవరేనా వస్తే కనుక్కుంటుంది. మన కన్న పిల్లలు ముందు ఇంటికి వస్తే పలకరించి కూర్చో పెట్టుకుంటుంది. జ్వరపడితే జావేనా కాచిపోయడానికి వెనకాడదు.

పొరుగావిడతో పడాలంటే మనం తగిన పొరుగుగా ఉండ కలగడమే. ఓ చిరునవ్వు, ఓ గంట కబుర్లు పెద్ద దండగ పెట్టుబడి కాదు. తక్షణం స్నేహాలాపంగా లాభం తెచ్చి పెట్టేవే. పొరుగు వారితో నాకేం పని? అని నిర్లక్ష్యం చేస్తే ఏమీ తోచని ఒంటరి తనానికి బాట వేసుకోవడమే. అందుకే పొరుగును ప్రేమించు అన్నారు!

---

**వంటలు:**

## చౌచౌ దోసెలు

మినప్పప్పు.
సెనగపప్పు.
పెసరపప్పు.

బియ్యం ఒకొక్కప్పు రాత్రి నానపోసి ఉంచాలి. ఉదయం ఇవన్నీ కలిపి కొటుకలాగా రుబ్బి తగినంత ఉప్పు, కొత్తిమీరి, పచ్చి మిరప అల్లం ముక్కలు దంపి ఆ పిండిలో కలియపెట్టి గరిటజారుగా కలియపెట్టుకోవాలి. బాగా కాలిన పెనం మీద దోసెలు పోసుకోవాలి. సన్నసెగమీద ఉండాలి పెనం. ఈ దోసెలు కమ్మగా రుచిగా ఉంటాయి. ఈ దోసెలకి నల్చుకుందును ఆధరవు కూడా అక్కరలేదు.




'డబ్బుపేరు చెప్తే పీనుగయినా లేచి వస్తుంది' అనే సామెత ప్రసిద్ధం. బయటికి ధనాన్ని గురించి యెలాటి విరక్తిని ప్రకటించినా మనస్సులో మాత్రం దాన్నిగురించిన ఆసక్తి వుండడం మానవ సామాన్య ధర్మం! యోగులుకూడా దీనికి అతీతులుకారు. అందులోనూ—సమస్తమూ ధనం పైనే ఆధారపడివున్న ఈ కాలంలో కాంచనాన్ని కాదని నిరసించేవారు ఉండడం మిక్కిలి అరుదు.

స్వామి వివేకానందులు నరేంద్రుడుగా వున్నప్పుడు — సన్యాసాశ్రమ స్వీకారానికి ముందు మహామహులను కూడా నిశితంగా పరీక్షించేవాడు. శ్రీ రామకృష్ణ పరమహంసపై గొప్ప గౌరవమూ, సాటిలేని మహామహుడనే భావమూ కలిగిన తర్వాత కూడా—ఆయనకూడా నిశిత పరీక్షకు గురికాకపోలేదు.

రామకృష్ణపరమహంసకు ధనంమీద అనుమాత్రమూ ఆపేక్షలేదు. అంతేకాదు. ఆ సంగతి యెత్తితేనే ఆయన ఏవగించుకునేవారు. దేవి అనుగ్రహంవల్ల ఆయనకు ఏదోవిధంగా కాలం గడిచిపోయేది. ఎలా జరుగుతున్నదీ — ఆయనకు ఆ విషయమై చింతయేలేదు. ఈ విషయం ఆయన శిష్యులకూ, ఆయనను ఎరిగిన పెద్దలకూ కూడా బాగా తెలుసు. అందువల్లనే ఎవ్వరూ ఆయనదగ్గర ఆర్థిక విషయమైన ప్రస్తావన చేసేవారేకారు. కాని, వివేకానందునికి మాత్రం కొంచెం అనుమానంగానే ఉండినది. ఎంత విరాగి అయినా డబ్బు విషయంలో ఏహ్యభావాన్ని చూపడం అసాధ్యం! మరి, పరమహంసకు ఆ విషయంలో వాస్తవంగా ఏహ్యభావం ఉన్నదో, లేదో ఈ యువకునికి తెలియడంలేదు — అంటే గట్టి నమ్మకం కుదరలేదన్నమాట!

ఈ విషయాన్ని ఒక పరీక్షమూలంగా నిర్ణయించాలనే సంకల్పం వివేకానందుడికి కలిగింది.

ఒకనాడు, ఎవ్వరూలేని సమయం కనిపెట్టి అతడు ఒకరూపాయ నాణాన్ని పరమహంస పరుండే బల్లమంచంపైని—పడకక్రింద ఉంచాడు. దానిపైని ఒత్తుగా పడక ఉండడంవల్ల— క్రింద ఆ నాణెం ఉన్న సంగతిని ఎవ్వరూ తెలుసుకోలేరు.

కొంతసేపయాక పరమహంస వచ్చి విశ్రాంతికోసం ఆ పడకపైని పరున్నారు. అప్పుడు ఆయన సమీపంలో శిష్యులు కొందరున్నారు. వివేకానందుడు కూడా ఉన్నాడు. పరమహంస మంచంమీద పరున్న మరుక్షణమే తేలుకుట్టినట్లుగా బాధపడుతూ తటాలున లేచి 'ఏదో కుట్టినట్లున్నది' అన్నారు. శిష్యులందరూ ఆందోళనపడుతూ మంచంమీది పడకను తీసి దులపసాగారు. అప్పుడు వెండి రూపాయి నాణెం మంచంమీదనుంచి కంగుమని ధ్వనిచేస్తూ నేలపైపడింది. అంతేకాని ఒక నల్లిఅయినా కనబడలేదు. రామకృష్ణుని వీపుపయిని రూపాయంత మేర దద్దుకట్టి ఉన్నది.

ఇది ఆ రూపాయి మహత్యమే అని శిష్యులు గ్రహించారు. వివేకానందుడు మాత్రం తక్కిన శిష్యులవలె ఆందోళన పడలేదు.

తర్వాత చర్చ వచ్చింది—'ఈ రూపాయి యిక్కడికి ఎలా వచ్చింది? గురువూ, శిష్యులూ తప్ప యితరు లెవ్వరూ రాని యిక్కడ దీన్ని ఎవరు ఉంచివుంటారు?' అని.

శిష్యులందరూ ప్రశ్నార్థకంగా ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటున్నారు. దీన్ని గురించే చర్చిస్తున్నారు కూడా.

వివేకానందుడు ఈ చర్చల్లో పాల్గొనడం లేదు.

అంతేకాదు.

మిగిలిన శిష్యులు యీ విషయమై చర్చిస్తూవుంటే ఆయన అక్కడనుంచి చల్లచల్లగా జారిపోయాడు!

తర్వాత తెలిసింది అందరికీ, యిది నరేంద్రుడు చేసినపనే అని.



# బాలామణి




■ నెమిలికోన !

కొండకోనల పరదాల్లో, గుబురుటడ వుల కౌగిట్లో—కొత్త పెండ్లికూతురివలె ఒదిగి కూర్చున్న చిన్నపల్లె! అక్కడి పచ్చిక పేలల్ని, పచ్చని చెట్లను చూస్తే పురి విప్పిన నెమళ్ళు జ్ఞాపకానికొస్తాయి.

నెమిలికోనకు రోడ్డు లేదు. ఆ వూరు చేరాలంటే సింగారపాళెంలో బస్సు దిగి, బండిబాట వెంబడి నాలుగు మైళ్ళు నడవాలి.

ఆ చుట్టుపక్కల పల్లెపట్లులన్నిటికీ సింగారపాళెం నడిగడ్డ. వారం వారం జరిగే సంతకూటంతో, రోజూ పల్లెజనాన్ని సూదంటురాయివలె ఆకర్షించే కొద్దిపాటి టౌనుహంగులతో సింగారపాళెం సింగార మొలుకుతూ వుంటుంది.

నీడలన్నీ మనిషి కోరికలవలె ఒక్క సారిగా నేలమీదికి చేతులు బారజాపిన వేళ — తాతలకాలంనాటి సన్నటి కంకర రోడ్డుమీద దుమ్మును రేపుకుంటూ బస్సు వచ్చి సింగారపాళెం బజారువీధిలో నిలి చింది. సుందరాచారి, బాలామణి బస్సులో నుంచి దిగినారు. సుందరాచారి సుందరుడే! బాలామణి బాలామణే! బస్‌స్టాండ్‌లోని జనం ఆ జంటను చూసి, కొన్ని క్షణాల కాలం ఒళ్ళు మరిచిపోయినారు. బాలామణి కన్నుల వెలుగు పగలే వెన్నెలవలె, బస్సు సుడులు రేపిన దుమ్ము శారదాకాశంలోని తెల్లి మబ్బులవలె, ఉయ్యాలలూగుతూ వొచ్చి నిలిచిన బస్సు వెండి మబ్బుల నురగలపైన తేలుతూ వొచ్చిన పూల తెప్పవలె, బాలామణీ సుందరాచారులు— ఆ పూల తెప్పలోనుండి దిగి నేలమీద అడుగుపెట్టిన తారాశశాంకులవలె తోచి, సింగారపాళెం బస్ స్టాండు బస్‌స్టాండూ మతి పోగొట్టుకొని, ఒక్క నిమిషంసేపు గోడమీది బొమ్మై అయిపోయింది. బాలా మణి ముఖం తామరపూల దొరసానివలె కనబడేదేమో — ఏడు గుర్రాల బండిపై ఎక్కి, పడమటికి ప్రయాణం కట్టిన సూర్యుడు ఒకసారి కన్నులపండగ జేసు కొనిపోదామని కొంచెం నిక్కిచూచినాడు.

బొమ్మ సముద్రం నిమ్మపండువంటి బాలామణి—మామిడిపిందెలంచు, సంపంగి రంగు వెంకటగిరి చీర కట్టుకొనింది. పొంకంగా అదే రంగు రవిక తొడిగింది. నల్లని జడలో కదంబం తురుముకొనింది. మగనిమీది వలపంతా తెల్లమయ్యేట్లు— నొసట ఎర్రని కుంకుమబొట్టు దిద్దు కొనింది. ఆమె చెవులకున్న, తెల్లరాళ్ల కమ్మలు, ముక్కున వున్న చిన్న ముక్కు పుల్ల ఆమె చెంపల్లో తమ అందాల్ని చూసుకుంటూవున్నాయి. చెక్కిన చంద నపు కర్రవంటి ఆమె మెడను తాళి బొట్టు కూర్చిన పసుపుతాడు, నల్ల పూసలదండ కౌగిలించుకొన్నాయి. చేతు లకు గుత్తమైన కాళహస్తి గాజులు. ముఖాన కదిరి మల్లెపూల సరంవంటి తెల్లని చల్లని చిరునవ్వు. మగవాడు కోరుకొనే వరం మాదిరిగా వుంది పద్దెనిమి దేండ్ల బాలామణి.

సుందరాచారిది చామనచాయ. మామూలు పొడుగు. ఆడంషానికి పనికొచ్చే సన్నని నాజూకైన ఒళ్ళు. పక్కపాపిడిదీసి, సన్నగా అణగదువ్విన క్రాఫు. కార్తీకమాసపు కొల

ముల్లవలె కోటలెల్లని కనులు; కల్లా కపటంలేని ముఖం. అతను కట్టుకొన్న ధోవతి, తొడుగుకొన్న చొక్కా బాలామణి మీది ముక్కువవలె తెల్లగా, తేటగా వున్నాయి. బాలామణి మాటల్లో 'నా వేయి నోముల ఫలం' సుందరాచారి.

గుడ్డకు గుడ్డ ముడి పెట్టినట్లు ఆ అలూ, మగడూ రోడ్డువార ఒకటి రెండు నిమిషాలసేపు నిలబడినారు. ఎదురుగా బీడీ బంకులో కూర్చున్న ఒంటి కంటి మనిషి బేరం సారం ఆపి, బాలామణిని కన్నార్పకుండా చూస్తూ వుండి పోయినాడు. పక్కన టీ అంగడివాడు చక్కెర వెయ్యకుండనే టీ కలిపినాడు. అంగడిముందర బెంచీమీద కూర్చున్న బట్టతలాయన ఆ టీ అందుకొని ఒక గుక్క చప్పరించినాడుగానీ, చక్కెర లేదేమని అడిగినవాడు కాదు. వాళ్లిద్దరి చూపులూ బాలామణి మీదనే!

ఎడమచేతికి ట్రంకుపెట్టె ఎత్తుకొని, కుడిచేతిలో గొడుగు పట్టుకొని ముందు సుందరాచారి, వెనకాల బాలామణి బజారులోకి నడిచినారు. ఎదురుగా వస్తూ వుండిన పొగాకు దొకడు ఆమె పక్కగా నడిచి, సందడిలో ఆమె భుజాన్ని రాచుకుంటూపోయినాడు. అరవైఏండ్లు బతికి, కడాపటిదినం సమారాధనలో అన్నం తిన్న దరిద్రుడివలె తృప్తి పడినాడు వాడు.

బాలామణి నడుస్తూనడుస్తూ సుందరాచారి పక్కకొచ్చి 'మామా! చమ్కీ గాజులు!...' అనింది.

'కొనుక్కుందాం!' అన్నాడు సుందరాచారి.

బజారు వీధిలో అంగళ్లన్నీ అప్పటికే తెరిచివున్నాయి.

ఇద్దరూ గాజులంగడిలోకి పోయినారు. అంగడివాడు చూపించిన రకరకాల గాజుల్లో తనకు నచ్చినవి, సరిపడేవీ రెండు జతల చమ్కీ గాజులు ఏరి, వాటిని కాగితంలో చుట్టి ఇమ్మనింది బాలామణి. తన చేతులతో అంత చక్కని పిల్లకు గాజులు తొడిగే అదృష్టంలేదని తెలుసుకొన్నాక, గాజులవాడికి ఆమె ఏరి కోరుకొన్న గాజుల మీద అసూయ పుట్టింది. గాజులతో బాటు రెండు నైలాన్ రిబ్బన్లు కూడ కొనుక్కొని ఆ జంట బయటపడింది.

ఊరుదాటి, నెమలికోనకు పోయే బండి బాటలోకి మరలినారు వాళ్లు. 'ఎంత దూరం వుంటుంది మామా?' అనింది బాలామణి చిలకమాదిరిగా.

'గబగబా నడిచేస్తే బిరాన వెళ్లిపోవచ్చు మెల్లిగానే నడుద్దాం. నీ కాళ్లు కంది పోతాయి!' అంటూ సుందరాచారి బరువుగా వున్న ట్రంకుపెట్టెను భుజంపై కెత్తుకున్నాడు. 'గొడుగు నాచేతి కియ్యి!' అనింది బాలామణి నవ్వుతూ.

చలికాలపు నీరెండ యింకా చురుకెక్కలేదు. దోవపక్కల చేనికల్లంమీద, తీగలమీదకూర్చొనిపిచ్చుకగువ్వలుఉయ్యాల లూగుతూ వున్నాయి. రకరకాల పిట్టలు ఒక పొదలోనుండి ఇంకొక పొదలోకి తుర్రుమంటూ ఎగురుతూ వున్నాయి. కోత అయిపోయిన పొలాల్లో మొలిచిన పచ్చి గడ్డి మంచు ముత్యాలతో తలంబ్రాలు పోసుకొనింది. చేలను ఒరుసుకుంటూ, గుట్టలను చుట్టుకుంటూ, పైకిలేస్తూ కిందికి దిగుతూ—దూరంగా కనబడే నీలి కొండల దిక్కుగా మూపుకంటే ముందుగా సాగిపోతూవుంది బాట. ఆ ఎర్రని మట్టి బాటలోని ఎగుడుదిగుళ్లలో ముండ్ల కంపల్ని, గులకరాళ్లను తొక్కుకుంటూ, ఆయాసపడుతూ, సుందరాచారి కొంటె మాటలు విని మనసార నవ్వుకుంటూ, ఆ పులకరింపులో తన ఆయాసాన్ని అప్పటికప్పుడే మరిచిపోతూ—కష్టసుఖాల బండివలె నడిచి పోతూవుంది బాలామణి.

కొంచెం దూరం వెళ్లినాక సుందరాచారి ఆగి 'నా చెప్పులు తొడుక్కో బాలామణీ!' అంటూ తన చెప్పులు విడిచి పెట్టినాడు.

'వొద్దు మామా! పద!' అనింది బాలామణి...

'దోవ బాగానేవుంది మామా!'

'తొడుక్కో!'

'అయితే నీకు?'

'తొడుక్కోమంటుంటే!...'

బాలామణి ఇష్టంలేకుండానే తొడుగు కొనింది. సుందరాచారి పెద్ద చెప్పుల్లో బాలామణి చిన్న పాదాలు. లంకంత యింట్లో గువ్వంత పెండ్లాం మాదిరిగా!

పొద్దు పైకెక్కి, ఎండ చురుకెక్కి, నీళ్లతో నిండివుండే కుంటలు, వంకలు వెండిరేకులవలె తళతళా మెరుస్తూ వున్నాయి. ఆ ఎండ బాలామణి మీద కూడా పడి, ఆమె చెంపల్ని బంగారు రేకులవలె మెరిపించినాయి.

'గొడుగు విప్పిపట్టుకో!' అన్నాడు సుందరాచారి.

'ఎండ ఎక్కడిది మామా?'

'మొగుడు జెప్పినమాట వినాల!'

'అయితే నీకు?'

'నువ్వుంటే నాకు వేరే గొడుగేల?' అన్నాడు సుందరాచారి. ఆమాటే తిప్పి చెప్పాలని బాలామణి మనసులో వుంది. అయితే సిగ్గు ఆ మాట చెప్పనిస్తుందా? ఎంత మొగుడైనా—తాను ఆడది కదా?... బాలామణి మాటాడకుండా గొడుగు తెరిచి పట్టుకొనింది.

వాళ్లు మూడుమైళ్లు అటుల నడిచినారు. బాటకు అడ్డంగా పారుతూవున్న సన్నటి వంక దగ్గరికొచ్చినారు. 'జాగర్తగా నడువు. పాచిమీద కాళ్లు జారతాయి.' అన్నాడు సుందరాచారి. బాలామణి చెప్పులు తీసి అవతలిగట్టుకు విసిరివేసింది. గొడుగు మడిచి చంకన బెట్టుకొని, తితో చేదీర కుచ్చిళ్లు పైకెత్తి పట్టుకొని, పాచి పట్టిన రాళ్లమీద జాగర్తగా అడుగు మోపుతూ వంక దాటుకొని, చెప్పులు చేతికెత్తుకొనింది. సుందరాచారి కూడా వంక దాటివొచ్చినాక 'చానా వేసటగా వుంది మామా! ఎక్కడైనా కొంతసేపు కూర్చొనిపోదాం' అనింది.

'అటులనే కానీ!'అన్నాడుసుందరాచారి.

ముందరే మలుపులో బాటకు కుడి పక్కన కపిలబావి వుంది. బావి గట్టున చల్లగా జామచెట్టునీడ. వాళ్లు జామ చెట్టుకిందికి రాగానే—చెట్టెక్కి పిందె కాయలు కోస్తూవుండిన ఇద్దరు పిల్లకాయలు బిరబిరా చెట్టుదిగి 'నమస్తే సార్!' అంటూ నిలబడినారు.

'ఓరే! మీరా? కోతులనుకొంటి. పశువుల పండగ బాగాజరిగిందా మీఊళ్లో?' అన్నాడు సుందరాచారి.

'బాగా జరిగిందిసార్!' అన్నాడు ఒక పిల్లవాడు.

ఇంకొక పిల్లవాడు బిడియపడుతూ—'ఎవరుసార్ ఈ అయ్యవారమ్మ?' అని అడిగినాడు.

'అవును అయ్యవారమ్మే!'

పిల్లకాయలు పరుగుదీసినారు.

బాలామణి, సుందరాచారి చెట్టుక్రీడన కూర్చున్నారు. జామచెట్టు కొమ్మపైకి రెండు చిలకలొచ్చి కూర్చున్నాయి పిల్లగాలి పరిగెత్తివొచ్చి బాలామణి చెవుల దగ్గిర ఇల్లు గట్టుకొనింది. ఊరిలోకి వచ్చిన సినిమా స్టారును చూసేందుకు ఎగబడే పడుచువాళ్లవలె — కాలవగట్టున చెండ్లు చెండ్లుగా పూచివున్న తురక చామంచి పూలు బాలామణి అందాలు చూసేందుకు ఒకదాన్నొకటి నెట్టుకుంటూ వున్నాయి. స్వర్గంవంటి ఆ చల్లనిచోట ఒకరిసరసలో ఒకరు కూర్చొనివుంటే— అంతకంటే హాయి ఇంకేదీ లేదనిపించింది ఆ యిద్దరికీ.

పిల్లకాయలు కోసి కొరికిపారేసిన జామపండు నొకదాన్ని చేతికి తీసుకొనింది బాలామణి. 'పచ్చి పిందెలు కోసేసినారు మామా! దీనిలో ఏముందనో? చెట్టన్నే వుండివుంటె—రేపటికో, ఎల్లుండికో ఇవి పెద్దవై, దోరమాగేవి చెట్టుకు అందమొచ్చేది.'

'ఈ చెట్టు వాళ్లదిగాదు.' అని, 'నీ దగ్గిర పిన్ను వుందా?' అని అడిగినాడు సుందరాచారి.

'ఏల?'

'ముల్లు విరిగింది'

బాలామణి తన రవికకున్న పిన్ను ఊడదీసింది మగడిపాదం చేతిలోకి తీసుకొని, అరికాల్లో విరిగిన ముల్లు తీయసాగింది. సుందరాచారి కనులు మూసుకొన్నాడు. 'ఓ యమ్మో! ఎంత పెద్ద ముల్లు!' అనింది బాలామణి. సుందరాచారి కనులు తెరిచినాడు. తీసిన ముల్లు అరచేత బెట్టుకొని, కనురెప్పలోనుంచి ఒక వెంట్రుక పెరికింది బాలామణి. 'ఎందుకు? ఏం చేయబోతావు?' అన్నాడు సుందరాచారి. 'మంచిముల్లో, చెడ్డముల్లో చూడవద్దంటావా? వెంట్రుకకు అంటుకుంటే మంచిముల్లు, అంటుకోకుంటే చెడ్డ ముల్లు!'

వెంట్రుకను సూదివలె పట్టుకొని ముల్లుమీద పెట్టగానే—ముల్లు వెంట్రుకకు అంటుకొనింది.

'అరె! మంచి ముల్లేనే!' అన్నాడు

# బాలామణి

సుందరాచారి.

'ఛీ! పాపిష్టిముల్లు! నీ కాలికి గుచ్చుకున్నాక మంచి ముల్లెట్లవుతుంది?' అంటూ బాలామణి దాన్ని విసిరిపారేసింది.

'వొద్దంటే విన్నావుగాదు. చెప్పులు తొడుగుకోమంటివి. నీ చెప్పులు నాకాళ్లు గరిచినాయి.' అంటూ తన పాదాలమీది బొబ్బల్ని చూపించింది. సుందరాచారి ఆ పాదాలను చేతితో తడిమినాడు. సుందరాచారి కాలిలో ముల్లు విరిగింది. బాలామణి కాళ్లను సుందరాచారి చెప్పులు కరిచినాయి. ఇద్దరూ పగలబడి నవ్వుకొన్నారు.

బాలామణి గబుక్కని కాళ్లు వెనక్కు తీసుకొనింది. నెమలికోన వైపునుండి ఎవరో గొంతెత్తి పాడేపాట వినబడింది. రానురాను ఆ పాట దగ్గరౌతూవుంది. అది గౌరీకల్యాణం. పదిహేడు, పద్దెనిమిదేండ్లు దటని నల్లటి పిల్లవాడొకడు అవును తోలుకొంటూ వస్తూవున్నాడు. వాడు కంటికి బాగా ఆనినంత దూరానికి రాగానే వాడి నోటివెంట వచ్చేపాట ఆగిపోయింది. వాడు దగ్గిరి కొచ్చినాక సుందరాచారిని పలకరించినాడు. 'గుడ్‌మార్నింగ్ సార్! ఎప్పుడొచ్చినారు? తెల్లారి బస్సుకేనా?'

'అవును గురప్పా!' అన్నాడు సుందరాచారి ఆదరంతో నవ్వుతూ.

'శనివారమే వొచ్చేసినారేమి సార్? సోమవారం కదా బడి?'

'ఔనన్నుకో! సోమవారమే వొచ్చి అప్పటికప్పుడే అన్నీ సర్దుకోవాలంటే కుదరదు. ఆదివారం పోకూడదన్నారు, అందుకని ఈరోజే రావటం.'

గురప్ప అరనిమిషం నిశ్శబ్దంగా నిలబడి, 'వొస్తాను సార్! సాయంత్రం ఇంటికాడికొస్తా లేండి.' అంటూ బాట విడిచి, ఆవు మేతకోసరం తుమ్మలకుంట దెసగా వెళ్లిపోయినాడు. మరలా అతని తియ్యనిపాటతో నేలా నింగీ నిండిపోయినాయి.

'జంగాన్ని కోరితివా లింగాల గౌరు?'
కట్టగుడ్డలు లేవు—కావి వస్త్రాలు!
పులితోలు—పుట్టమ్మ, బూదిగంధమ్ము
భూషణంబులు లేవు; పునుకలే కావి.
భుజియింపగా బోలుపుర్రెయే గౌరి!
ఎక్కడగ గుర్రమ్ము ఎద్దు కూతూరా!
పండ స్థలములేదు—కొండయేగాని!...'

...ఆ పాట వింటూవుంటే ఆ కొత్త జంటకు తేనెజల్లు కురుస్తూ వున్నట్లనిపించింది. పొయ్యిమీది పాలవలె పొంగిపోతున్న మక్కువను దాచుకునేందుకు ఈ గుండె చాలదేమో అనిపించింది. తన్మయుడైన సుందరాచారి జేబులోవున్న చమ్కీ గాజులు తీసి బాలామణి చేతులకు తొడుగుతూ 'ఆ మాటలకు గౌరి ఏమనిందో తెలుసా బాలామణీ?' అన్నాడు మల్గోవా మామిడిపండంత తీయగా.

'తెలుసు' అనింది బాలామణి అంతే తీయగా.

'ఏమనింది?'

ఆమె అతని ముఖంలోకి చూచింది.

'చెప్పు బాలామణీ!'

బాలామణి కనులు మూసుకొనింది.

* * *

బాలామణి గౌరమ్మ అయితే ఆమె వలచికొలిచే జంగముదేవర—సుందరాచారి. పుట్టగానే బాలామణికి 'సుందరుడి పెండ్లాం' అని పేరు పెట్టినారు. 'ఈ పుస్తకం నాది!' అనే వయస్సులో 'బాల నాది!' అన్నాడు సుందరాచారి. ఈ భావబంధంతోనే—బాలామణి, సుందరాచారి రచ్చబండమీది రావిచెట్టు, వేప చెట్టువలె జంటగా పెరిగినారు.

ఓనమాలు దిద్దుకొనే లేతవయసులోనే అమ్మను, నాయనను పోగొట్టుకున్న సుందరాచారిని అతని మేనమామ విశ్వనాథాచారి చేరదీసినాడు. ముగ్గురాడు పిల్లల తండ్రి విశ్వనాథాచారి యింట కొడుకువలె పెరిగినాడు సుందరాచారి. రెక్కాడితేనేగానీ డొక్కాడని సంసారం వాళ్లది. విశ్వనాథాచారి నమ్ముకొన్న కులవృత్తి ఒక్కటే అంతమందికీ కూడు పెట్టింది.

భ్రాతిదార్లవంటి కళ్లద్దాలు పెట్టుకొని, తాను మాత్రమే కుంపటిముందు కూర్చొనేవాడు విశ్వనాథాచారి. ఎప్పుడైనా మేనల్లుడు దగ్గిరికి వొచ్చి కూర్చుంటే 'నీకే పని వొద్దు. చదువుకో నాయనా!' అంటూవుండేవాడు.

సుందరాచారి ఎసెసెల్సీదాక చదువు

కున్నాడు. మరల చిత్తూరులో రెండేండ్లు పాటు సెకండరీ గ్రేడు ట్రెయినింగు చదివి, పరీక్ష ప్యాసైనాడు. డిస్ట్రిక్టు సెలెక్షన్ కమిటీవారి ఉత్తర్వుతో తన స్వంత పంచాయతీ సమితిలోనే ఉద్యోగ జీవితం ప్రారంభించినాడు. రెండేండ్లపాటు ఒకటిరెండు స్కూళ్లలో పనిచేసినాక, నెమిలికోనకు సింగిల్ టీచరుగా బదిలీ అయినాడు.

అప్పటికి పెద్దపిల్లలిద్దరు పెండ్లిండ్లు జేసుకొని,కాపురాలకు వెళ్లిపోయినారు. దొంతిలో దాచిపెట్టిన దోరమామిడికాయ కలమాగినట్లు నిండుపరువంతో నవనవలాడుతూవుంది — మూడవఫారం చదివి నిలిచిపోయిన బాలామణి. మేనమామ రాసిన జాబు చదువుకొని, నోముల నెలలో యింటికి పోయినాడు సుందరాచారి. ఇంటి మెట్లెక్కుతూ వుంటే అనుకోకుండా ఎదుటబడిన బాలామణి అతన్ని జూచి తొలిసారిగా సిగ్గుపడి పారిపోయింది. సుందరాచారి పిచ్చివాడై పోయినాడు. అతని కనులకు ఆమె కొత్తగా, అంతకు ముందెప్పుడూ చూడని అప్సరసవలె కనబడింది. అన్నినాళ్లూ తపసుచేసి, దేవుళ్లను మెప్పించి, అందచందాలను, రూపలావణ్యాలను వరాలుగా పొంది, సుందరాచారిని ఉడుకాడించేందుకు ఎదురుచూస్తూ వుందా బాలామణి? ఇప్పుడామె బాలామణి గాదు; మోహిని!

తిరుచానూరు సత్రంలో, పెద్దలు చల్లిన అక్షంతలవానలో సుందరాచారిచేత బొట్టు కట్టించుకొని, అలిమేలు మంగమ్మకు మనసులోనే వేయిదండాలు పెట్టుకొనింది బాలామణి.

సుందరాచారి నెమిలికోనకు తిరిగివచ్చి, కాపురానికి తగిన ఇల్లు జూసుకొని, అవసరాలకు కావలసిన సామానులన్నీ పదిలపెట్టి, పెండ్లి అయిన మూడవనెలలో— సంక్రాంతి సెలవుల్లో ఇంటికిపోయినాడు. పెండ్లి అయినది మొదలు మూడవనెల వరకు ఆలుమగలను హద్దుల్లోనే పెట్టటం వాళ్ల యిళ్లల్లో సాంప్రదాయం. అన్నినాళ్లూ సుందరాచారి మహావాక్కర్మలా, బాలామణినే ఆరాధించినాడు. ఆమె లేని తన బ్రతుకు మిథ్య అనుకున్నాడు. ఇంక ఆమె కూడా అటులనే అనుకోవాలి అందులో సందేహానికి తావులేదు. మతాలు, శాస్త్రాలు జీవితాన్ని ప్రసాదిస్తాయి జీవితాన్ని పారవంతం చేస్తాయి.

పండుగ వేడుకలతో, శోభనపు ముచ్చట్లతో — విస్తరాకులో పిండివంటలవలె ఆ వారందినాలూ గడిచిపోయినాయి. ఆనాటి వేకువఝామున తన కూతుర్ని అల్లుడి వెంట నెమిలికోనకు సాగనంపుతూ ఆమె నొసట బొట్టుపెట్టి, బాలామణి తల్లి కనుల నీళ్లు పెట్టుకొనింది. 'కూతురా! నీ మామ ఉన్నవాడో, లేనివాడో! ఏమైనా లేదని మాత్రం ఏనాడూ అనుకోవద్దు! వాడి మనసు నీకుంది. ఆడదానికి అదే భాగ్యం!...సారెలేకుండా మొగుడి యింటికి పోతూవున్నానని చిన్నబోవద్దు. మనసున్న కాపురం, మచ్చలేని బతుకు—ఇవే ఆడది మగవాడికిచ్చే ఘనమైన కట్నాలు!'

* * *

కనులు మూసుకొన్న బాలామణి ముఖం ఎర్రబడింది. గొంతు వీణ తీగవలె ప్రకంపించింది.

'జంగముదేవరే జగమునేలత!
జంగముదేవరే సర్వేశ్వరుండు!'

...అనురాగం మిన్నేరువలె పొరలి పారుతూ, మనసులను ఊపివేస్తూవుంటే గౌరీశంకర శిఖరంమీద కొలువైన శివపార్వతులవలె లోకమే మరిచిపోయినారు బాలామణీ సుందరులు.

అదే సమయంలో సింగారపాళెం నుండి సైకిలు మీద వొస్తూ వున్నాడు అరడుగుల అబ్బాయినాయుడు వంకదాటి, మిట్ట ఎక్కుతూ వుంటే—ఒరిగిపడిన జామపండు వలె బాలామణి అతని కనులబడింది. గుచ్చుకున్న బాణం వలె ఆ చూపు ఆమె మీద అటులనే నిలిచి పోయింది. అబ్బాయి నాయుడు దీప చూసుకొనే ఇరవై బారల దూరం సైకిలు తొక్కినాడు. సైకిలు చక్రాలు జామచెట్టు దగ్గర గతుకుల్లో తగులుకొని జర్రుమన్నాయి. కిందపడబోయిన అబ్బాయినాయుడు ఎటులనో నిలదొక్కుకొని, సైకిలు దిగినాడు. ఈ గడబిడ విని బాలామణి, సుందరాచారి ఉలికిపడి చూచినారు.

'నమస్కారం!' అన్నాడు సుందరాచారి సైకిలేస్తూ.

'నువ్వు సుందరాచారి ఊరి నుంచేనా?'

'అవునండీ!'

'...ఎవరూ? మీ ఆడవాళ్లా?'

'అవును.'

'అయ్యో! నడచి వొచ్చినారా? బండి కట్టి తెమ్మని ముందే ఎవరితోనైనా చెప్పక పోయినారా? పాపం, ఆడవాళ్లు ఎట్లా నడుస్తారనుకున్నారు? ఒకటా రెండా? నాలుగుమైళ్లు!...' అంటూ అబ్బాయినాయుడు పక్కకుతిరిగి, దూరంగా దేనికోసమో చూచినాడు. కనుచూపు దూరాన ఎద్దులబండి ఒకటి వొస్తూ వుంది. 'అదో! మన బండే వొచ్చేసిందిలే!... మీరు గూడా దానిలోనే ఎక్కరావొచ్చు.'

'ఎందుకులెండి! మూడుమైళ్లు రావే



కొచ్చినాను. ఇంకొక్క మైలే గదా?' అన్నాడు సుందరాచారి మొహమాట పడుతూ.

'అదేం సుందరాచారీ? బండిలేకుంటే సరే! ఉందిగదా మన బండి!... ఆమె





నెక్కించేసెయ్యి. మనం నడిచి పోదాం.'

బండి దగ్గరికి వొచ్చింది. సేద్యగాడు బండి తోలుతూ వున్నాడు. అబ్బాయి నాయుడి భార్య, ఇద్దరు పిల్లలు, ఇంకెవరో ఇద్దరు ఆడవాళ్ళు బండిలో వున్నారు. వాళ్ళందరూ రాత్రి సింగార పాళెంలో సినిమా జూసుకొని, చుట్టాల యింట్లో పండుకొని, నెమిలికోనకు తిరిగి వొస్తూ వున్నారు.

'ఎక్కమ్మా!' అన్నాడు అబ్బాయి నాయుడు.

బాలామణి మొగుడి ముఖం చూచింది. ఎక్కమన్నట్టు తలాడించినాడు సుందరాచారి. ఆమె పెట్టెతో బండిలో కెక్కి కూర్చొనింది.

ముందు బండి సాగిపోతూ వుంది. వెనక చేతులూపుకుంటూ సుందరాచారి, సైకిలు తోసుకుంటూ అబ్బాయి నాయుడు నడుస్తూ వున్నారు. గుచ్చుతున్న బాణాల వలె అబ్బాయినాయుడు చూపులు బండిలోనే వున్నాయి.

* * *

మూడంకణాల పూరిల్లు. ఆ యింట్లో సుందరాచారి పోగుజేసి పెట్టించదల్లా రెండు కొత్త చాపలు, రెండు దిండ్లు, రెండు కొత్త కడవలు, అయిదారు కొత్త కుండలు, ఒక మోపు కట్టెలు, వంటకు కావలసిన కొన్ని సరంజామాలు. పోగానే—బాలామణి ఇల్లు ఊడ్చింది. వెంట తెచ్చిన వెంకటేశ్వరుడి పటాన్ని గోడకు తగిలించి, దండం పెట్టుకొనింది. నడివీధిలో వున్న చేదబావిలో నుండి కడవతో నీళ్ళు తెచ్చుకొనింది. పొయ్యి ముట్టించి, ఎసరు పెట్టి, వంటపనిలో మునిగిపోయింది. ఈ లోపల—అబ్బాయినాయుడు కొట్టించి పంపిన ఈతాకులతో పెరడు కట్టించినాడు సుందరాచారి.

ఆ సాయంత్రం పొద్దు గ్రుంకుతూ వుండగా—సుందరాచారి యింటికొచ్చినాడు గురప్ప. సుందరాచారి, అబ్బాయినాయుడు యిద్దరూ చాప మీద కూర్చొని కాఫీ తాగుతూ వున్నారు. పశువులతో గలిసి పులి కసవు మేస్తూ వుంది. 'ఎప్పుడూ రాడే — ఈ దొంగనాయాలిక్కడికెందుకు కొచ్చినట్టు?' అనుకున్నాడు గురప్ప.

గురప్ప తొమ్మిదో తరగతివరకు చదువుకొని, మూడేండ్ల కిందట వాళ్ళనాయన కాలమైపోగా, పొలం పనులు చూసుకునే దిక్కులేక మానుకున్నాడు. ఇంతవరకు నెమిలికోనకు వచ్చి పనిచేసిన టీచర్లందరిలోకి సుందరాచారే అతనికి దగ్గరివాడైనాడు. సుందరాచారి మంచివాడు. బడి గోడలమీది మంచి మాటల్ని బాగా ఒంటబట్టించుకున్నవాడు.

గురప్పకు అబ్బాయినాయుడంటే — మనసు మారుమూలల్లో చెప్పలేనంత అసహ్యం. వాడిలో మంచిలేదు. దయా దాక్షిణ్యాలు లేవు. నీతి, న్యాయం లేని రాజకీయోద్యోగి మనస్తత్వం వాడిది. తప్పులు, దోషాలూ నెమిలి కన్నులవలె వాడి బతుకంతటా నిండిపోయినాయి.

నెమిలికోన, ఆ ప్రాంతాల్లో అందరికంటే పచ్చగా వున్నవాడు అబ్బాయినాయుడు. వాళ్ళనాయన బాగా సంపాదించి ఏమీ ఎత్తుకొనకనే పోయినాడు. మార్కులు సంపాదించుకోలేక ఎసెసెల్సి ఫెయిలయిన అబ్బాయినాయుడు ఆస్తి వ్యవహారాలు చూసుకుంటూ బాగా డబ్బు సంపాదిస్తూ వున్నాడు. నెమిలికోన పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగిరీ అతని తండ్రికేవుండేది. అది కూడా వంశపారంపర్యమైన హక్కువలె, తండ్రి పోయినవెనుక అతనికే దక్కింది. 'చదువుకున్నవాడివి, డబ్బున్నవాడివి, నలుగురితో మాట్లాడగలిగినవాడివి. నువ్వే వుండు!' అన్నారు మెంబర్లు.

ఆ ప్రెసిడెంటు పట్టం కూడా అబ్బాయినాయుడి సంపాదనకు ఇంకా బాగా పనికివచ్చింది. అతనికి ఎవరిమీదా సానుభూతి లేదు. మాటలు మర్యాదగా వుండవు. అయ్యవార్లంటే చులకన. సుందరాచారి నెమిలికోనలో వున్న ఈ మూడు నాలుగు నెలల్లోనూ — అబ్బాయినాయుడు అతనితో స్నేహంగా ప్రవర్తించనే లేదు. అతనితో మాట్లాడిన రెండుమూడు సందర్భాల్లోనూ—అనాదరణ, అమర్యాద—ఇవే బయటపడినాయి. అటువంటి అబ్బాయినాయుడు ఇప్పుడిక్కడెందుకున్నాడు? సుందరాచారితో ఈ సహవాసం ఏమి?

గురప్పకు సుందరాచారిపైన కోపం వొచ్చింది. అతనికి తెలియదా? తాను

చెప్పవలెనా? అది మర్యాద కాదుగదా!... బాలామణి గురప్పకు కాఫీ యిచ్చింది. గురప్ప కాఫీ తాగి, లోటా ఆమె చేతి కిచ్చి 'అక్కా!' అన్నాడు. 'అక్కా! అయ్యవారు చానా మంచివాడు! అయినా, మరీ ఇంత మంచితనం పనికిరాదు.' అని చెప్పాలనివుంది. అయితే సుందరాచారి, అబ్బాయినాయుడు అక్కడనే వున్నారు. 'పోతానక్కా.' అని వెళ్ళిపోయినాడు గురప్ప.

గురప్ప పోయిన కొంతసేపటికి బాలామణి గబగబా పెరట్లోకి నడిచిపోయి, అక్కడ వాంతి చేసుకొనింది. సుందరాచారి ఆమె వెనుకనే వెళ్ళి, 'ఏమి బాలామణీ? ఏమైంది?' అన్నాడు ఆత్రంగా.

'ఏమీ ఫరవాలేదు మామా! కనులు తిరిగినాయి. అంతే!' అనింది బాలామణి. అబ్బాయినాయుడు ఆ మాట విన్నాడు. లేచి, వీధిలో పరుగెత్తుతూ వున్న ఒక పిల్లవాణ్ణి పిలిచి 'ఒరే! పోయి, పరదేశి వుంటే ఇక్కడికి రమ్మని చెప్పు. నేను రమ్మంటూ వున్నానని చెప్పు!' అన్నాడు

పరదేశిని అందరూ ఆడంగివెధవ అంటారు. అతనికి హద్దులూ, అడ్డాలూ లేక అందరివలెనే తింటాడు. అందరి వలెనే నిద్రపోతాడు. అయితే పనీపాటూ ఏమీ చేయడు. అతను చిన్న చిన్న రోగాలకు మందులిస్తాడు. మంత్రాలు వేస్తాడు. స్త్రీ వశీకరణం నాకు తెలుసునంటాడు. అయితే చెప్పనంటాడు. అతని బతుకు యిటులనే గడిచిపోతూవుంది.

పరదేశి వొచ్చినాడు. బాలామణి చేయి పట్టుకొని, నాడి పరీక్షించినాడు. 'ఆఁ, ఏముంది? ఎండలో నడిచి వొచ్చింది కదా?... పైత్యం జేసింది. ఆ పైన దిష్టి గూడా బాగా తగిలింది. ఒకటే మంత్రానికి అంతా ఎగిరిపోతుందిలే!' అన్నాడు. పొరువేటలో పొత్తేలును కాల్చేంత ఏకాగ్రచిత్తంతో వేపాకుతో మంత్రించినాడు. 'చీకట్లైపోయింది. నేను వస్తాను సుందరాచారీ! జాగర్త!... పద పరదేశి!' అన్నాడు అబ్బాయినాయుడు. ఇద్దరూ వెళ్ళిపోయినారు.

ఊరంతా నిద్రకుపక్రమించిన వేళ — సుందరాచారి బాలామణి మదురు మీద చేతితో నిమురుతూ 'ఇప్పుడెట్లుంది బలామణీ?' అని అడిగినాడు.

'బాగుంది మామా.'

'మంత్రం పని జేసిందా?'

'కాదు! నీ చేతి చలవే!'

* * *

సుందరాచారితో అబ్బాయినాయుడి స్నేహం సాయంకాలపు నీడలాగె గబగబా పెరిగిపోయింది. కనీసం రోజుకొకసారైనా ఇంటికి వొచ్చి పోతూ వున్నాడు అబ్బాయినాయుడు. 'సుందరాచారి లేడా?' అని బాలామణి నడిగి, ఆ వెనుకనే బడి దగ్గరికి పోతూ వున్నాడు.

రిపబ్లిక్ దినోత్సవం నాడు సుందరాచారి ప్రెసిడెంటు అబ్బాయి నాయుడి చేతనే జెండా ఎగురవేయించినాడు. అబ్బాయినాయుడు పిల్లల నుద్దేశించి ఇటుల మాట్లాడినాడు. 'మనది భారతదేశం మనమంతా భారతీయులం. నేటి బాలలే రేపటి పౌరులు. మీరంతా పెరిగి పెద్దవాళ్ళై, గాంధీ, నెహ్రూల మాదిరిగా మనదేశానికి పేరు తేవాల! భారతమాతాకు జై! మహాత్మా గాంధీకి జై! జవహర్లాల్ నెహ్రూకు జై!'

పిల్లకాయలకు మిఠాయిలు పంచిపెట్టి, యింటికు పంపించి వేసిన తరువాత 'సింగారపాళెం పోయి వద్దామా సుందరాచారీ?' అన్నాడు అబ్బాయి నాయుడు.

'పనుంటే పోదాం!'

'మండీలో డబ్బు రావాల! అది తీసుకొని, మాపటి వేళకల్లా వొచ్చేద్దాం.'

'నేనూ మీతోనే! నాకు మాత్రం వేరే పనేముంది?' అన్నాడు పరదేశి.

సుందరాచారి బాలామణితో చెప్పి బయలుదేరినాడు. 'సరసంగా వుంటే చిన్న అండా ఒకటి తీసుకొని రా మామా! నీళ్ళు కాచుకునేందుకు!' అనింది బాలామణి.

'జానాను!' అన్నాడు పరదేశి.

ముగ్గురూ నడకమీదనే సింగారపాళెం పోయినారు. మండీలో రావలసిన డబ్బు లెక్కపెట్టి తీసుకున్నాడు అబ్బాయినాయుడు. మధ్యాహ్నం హోటలులో భోజనం చేసినారు. కొంతసేపు బస్‌స్టాండు దగ్గర గడిపినారు. అది అబ్బాయినాయుడి సరదా. సాయంకాలం కాబోతూ వుండగా పాత్రల అంగడిలోకి పోయినారు. ఒక నడిసైజు హండా చూపి వెల అడిగినాడు సుందరాచారి. అరవై రూపాయలు చెప్పినాడు అంగడివాడు

'పోదాం పద నాయుడూ! ఇంకొకసారి వొచ్చినప్పుడు తీసుకోవచ్చు!' అన్నాడు సుందరాచారి. అతని జేబులో ముప్పై రూపాయలే వున్నాయి.

'వొద్దంటే ఎట్లసార్? అండా తీసుకొని రమ్మని బాలమ్మ చెప్పింది గదా? బానలో ఎన్నాళ్ళు కాచెడుతుంది? కొనుక్కోండి!' అన్నాడు పరదేశి

'అదికాదు పరదేశి...'

'డబ్బు చాలదనేనా సుందరాచారీ?





ఉత్తరాలు రాసేవారికి మనవి: ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి! కాగితానికి ఒకవయిపునవే రాసి ఉండాలి. రాసినవారి పేరు, చిరునామా తెలుగు అక్షరాలలోనే రాయాలి. వీలయినంత దాకా ఇంగ్లీషు, ఇతర భాషల అక్షరాలు వాడవద్దని లేఖకులకు మనవి చేసుకుంటున్నాము. (సం)



# బాలామణి

పెద్దడబ్బు! అవసరానికి పనికిరాకపోతే ఈ డబ్బుదేనికి?... ఇయ్యవయ్యా ఆ అండా!' అంటూ నూరురూపాయలనోటు ఒకటి తీసి సుందరాచారి చేతిలో పెట్టినాడు అబ్బాయినాయుడు.

'వొద్దు నాయుడా! ఇప్పుడే కొనుక్కోవాలని ఏముంది?' అంటూ సుందరాచారి ఆనోటు తిరిగి ఈయబోయినాడు.

'ఇదో, నాకు కోపమొస్తుంది.'

సుందరాచారి కాదనలేకపోయినాడు.

'మంచిబిందె కూడా ఒకటి తీసుకోండి సార్! అయ్యవారమ్మ సంతోషపడుతుంది' అన్నాడు పరదేశి.

నూరురూపాయలుపెట్టి హండా, బిందె కొనుక్కొని బయటకు వొచ్చినారు ముగ్గురూ. జేబులోవున్న ముప్పయ్యాతీసి అబ్బాయినాయుడి కీయబోయినాడు సుందరాచారి.

'ఫరవాలేదు పెట్టుకోవయ్యా స్వామీ! నీదగ్గర ఎక్కడికి పోతుంది? నా కిప్పుడు అవసరంలేదు!' అన్నాడు అబ్బాయినాయుడు.

ఊరిచివర వడ్లమిల్లు దగ్గరికొచ్చినారు. వడ్లు దంపించుకొని ఎవరిదో ఎడ్లబండి నెమిలికోనకు పోతూవుంటే — హండా, బిందె బండిలోపెట్టి, సుందరాచారి యింటిలో యిమ్మన్నారు. హోటలులో టిఫినుతిని, కాఫీత్రాగి, చీకటి పడేసరికి నెమిలికోన చేరుకున్నారు.

సుందరాచారి యింటికిరాగానే 'ఎంతయింది మామా వీటికి?' అని అడిగింది బాలామణి.

'నూరు!'

'ఎక్కడివి?'

'నాయుడిచ్చినాడు.'

'ఎందుకు కొంటివి మామా యివి? బుద్ధిలేనిదాన్ని—సరసంగావుంటేతెమ్మంటిని గానీ, అప్పుజెయ్యమంటినా?'

'ఏం జెయ్యమంటావు చెప్పు? వొద్దంటే వింటేగదా? ... మంచినాయుడబ్బా! బలే మొండితనం!' అంటూ నవ్వినాడు సుందరాచారి.

మట్టికుండలే మేలనిపించింది బాలామణికి.

* * *

అన్ని నెలల్లోనూ ఫిబ్రవరి చిన్ననెల. అయితే అది ఈసారి బ్రహ్మాండమంత సంబరంతోనే వొచ్చింది జనరల్ ఎలక్షన్ల ప్రచారాలహోరు పల్లెలనిండా కమ్ముకొనింది. అబ్బాయినాయుడికి నిమిషం తీరుబాటులేదు. ఫలానా గుర్తుకే ఓటుముద్ర వేయండంటూ జీపుల్లో ఊరూరా తిరుగుతూ వున్నాడు. అయినా — ఇంటికి అన్నానికి రానివేళలైనా వున్నాయికాని, బాలామణిని దర్శించుకోని దినమాత్రం లేదు.

జీతం రాగానే సుందరాచారి అబ్బాయినాయుడికి నలభైరూపాయ లియ్యబోయినాడు. 'ఇప్పుడు నాకు అవసరమేముంది సుందరాచారీ? నువ్వే ఖర్చుపెట్టుకో!' అన్నాడు అబ్బాయినాయుడు. అతన్ని సింగారపాళెం తీసుకొనిపోయి, ఆ డబ్బుతో పరుపు, దుప్పట్లూ కొనిపించినాడు.

ఎన్నికలరోజు దగ్గరపడింది. సుందరాచారిని పోలింగ్ ఆఫీసరుగా సింగారపాళేనికి వేసినారు. పదునైదవతేదీన ఎన్నికలు. అయితే అతను పద్నాలుగోతేదీ మధ్యాహ్నానికే సింగారపాళెం చేరుకోవాలి! ... అబ్బాయినాయుడికీ సంగతితెలిపి, బాలామణితోచెప్పి, ఆరోజు సింగారపాళెం వెళ్ళిపోయినాడు సుందరాచారి.

తెల్లవారితే ఎన్నికలు. నెమిలికోన స్కూలు కూడా ఎన్నికల కేంద్రంగా మారిపోయింది. అబ్బాయినాయుడు ఆ పగలూ, రాత్రీ నెమిలికోనకు సంబంధించిన పల్లెలన్నీ తిరిగివొచ్చినాడు. రాత్రి నడిజాము వరకు భజనదేవళం ముందు అరుగుమీద కూర్చొని ఊరిపెద్దలతో ఎన్నికల కబుర్లలో మునిగి తేలినాడు.

ఈదురుగాలి చురుక్కుమని పొడుస్తూవుంటే, కనులు నిద్రతో కూరుకొనిపోతూవుంటే,—దేవళంముందు కూర్చున్నవాళ్ళంతా లేచి ఇండ్లకు వెళ్ళిపోయినారు. అబ్బాయినాయుడు కూడా లేవగానే వీధి నిర్జనమైపోయింది.

(ముగింపు పై వారం)



'పాలమనసు'లులో జమున, హరనాథ్.

చిత్రసమీక్షలు:

# పాలమనసులు

గౌరీ ప్రొడక్షన్స్‌వారి 'పాలమనసులు' ఉన్నతాశయం గల ప్రయోగాత్మక చిత్రం ఇలాంటి చిత్రాలు మనకి రావాలి ప్రేక్షకులకి ఈ రకం చిత్రాలు అలవాటు చేసి చలన చిత్ర రంగాన్ని కొత్త పుంతలు తొక్కించడం చాలా అవసరం అందుకు ముందంజ వేసిన గౌరీ ప్రొడక్షన్స్ కృషి చిరస్మరణీయం.

పాలమనసులు కథ 'వెండి మబ్బు'గా ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు సుపరిచితం చిత్రీకరణ కథకి చాలా దగ్గరగా జరిగింది ప్రయోగాత్మక చిత్రమని పించుకోవడానికి కారణం ఇదే!

జమున చాలా ఉత్తమాదర్శాలు గల అమ్మాయి హరనాథ్‌కి జమున నిచ్చి వివాహం వెయ్యాలని ఆమె తల్లిదండ్రులు(గుమ్మడి, పండరీబాయి) ముచ్చటపడి ఏర్పాట్లు చేస్తారు గుమ్మడి ఖర్చుతో విదేశాలలో చదువు ముగించి వచ్చిన హరనాథ్ జమునని పెళ్లి చేసుకోవడం ఇష్టం లేదంటాడు అందుకు కారణం గుమ్మడి ఆస్తికి మరో వారసుడు పుట్టడమే! గ్రహించిన జమున ఆశలు కూలిపోతాయి. అయినా అతనికి సేవ చేస్తుంది హరనాథ్ జమునని మనస్ఫూర్తిగా ప్రేమించేసరికి సమయం మించిపోతుంది. జమున హృదయంలో అతనికి స్థానం లభించదు లభిస్తుందా? అనే శేష ప్రశ్నతో చిత్రం ముగుస్తుంది

జమున పాత్రని మలచడంలో తీసుకున్న జాగ్రత్త వల్లనే చిత్రం రసవత్తరం అయింది. జమున తన పాత్రని పోషించిన తీరు చిత్రానికి ప్రాణం. ఒక మంచిపాత్రని అర్థవంతంగా నటించిన కీర్తి హరనాథ్‌కి దక్కుతుంది గుమ్మడి నటన, పండరీబాయి నటన చిత్రానికి శిరోమాణిక్యం. రావి కొండలరావు ఆదినుంచి చివరివరకు పట్టుతప్పని హాస్యాన్ని అందించారు చలం, రమాప్రభల విన్యాసములు కొంచెం వెలితిగా కనిపించినా, ఇటువంటి చిన్న లోపాలని ఇతివృత్తం పక్కకి నెట్టివేస్తుంది, మిక్కిలినేని, ఛాయాదేవి నటన బాగున్నది. బేబీరాణి ఎంతో ముచ్చటగా నటించింది.

డబ్బును కురిపించే నృత్యాలు లేకుండా ఆదర్శంగా నిరాడంబరంగా నిర్మించిన చిత్రమిది. ఏ కోణం నుంచి చూసినా చిత్రం ఉన్నత పరిమాణంతో కనిపిస్తుంది. సంగీత సారథ్యం వహించిన సత్యం మెప్పుకోలును తెచ్చుకుంటాడు. పాటలన్నీ బాగున్నాయి యస్ యస్ ఆర్ శర్మ దర్శకత్వంలోని చాతుర్యానికి ప్రతి సన్నివేశమూ అద్దమే కీ శే త్రివేణి కథకి పాలగుమ్మి పద్మరాజు మాటలు రాశారు. నిర్మాత వై వి రావు ప్రతిభావంతమైన చిత్రాన్ని నిర్మించి చలన చిత్ర చరిత్రలో ఉత్తమమైన స్థానాన్ని సంపాదించుకున్న యస్. భావనారాయణ అభినందనీయులు ●

# వీరపూజ

జానపద చిత్రాలు విజ్ఞాన దాయకంగా వుంటాయి అనేకంటే వినోదాత్మకంగా వుంటాయనడం సబబు. వాస్తవికతకి దూరంవెళ్లే కొద్దీ వినోదానికి ముడిసరుకు కావలసినంత దొరుకుతుంది ప్రజలు వినోదాన్ని ఆశించినంత కాలం, అక్షయపాత్ర నుంచి ఈ ముడిసరుకు లభించినంత కాలం జానపద చిత్రాలు ఉద్భవిస్తూనే వుంటాయి, నిర్మాతలని పోషిస్తూనే వుంటాయి.

జానపద చిత్రంలో కథగురించి అడగక పోవడం తెలివైన లక్షణం నటీ నటుల సామర్థ్యం, దర్శకుని ప్రతిభ, కన్నుల పండువయిన దృశ్యాలు, సంగీతం— చిత్రానికి ఆభరణాలు. ఈ ఆభరణాలు కృత్రిమంగా



'వీరపూజ'లో వాసంతి.



'టిక్కా శంకరయ్య'లో జయలలిత, రామారావు.

# చిత్రసమీక్ష

కాకుండా ఎంతబాగా ప్రకాశిస్తే ఆ చిత్రం అంతగా ఆదరణ పొందుతుంది. విజయ పార్థి ప్రొడక్షన్స్‌వారి వీరపూజ పైకోవ లోని చిత్రాలలో ఒకటి!

తమ్ముడు ఆశించిన భోగభాగ్యాలకి దూరంగా తప్పుకున్న స్వార్థత్యాగి కథ ఇది. పైగా, ఆ తమ్ముడు సవతితమ్ముడు! ప్రజా క్షేమంకోసం దుర్మార్గుడయిన తమ్ముడికి పట్టం కడతాడు అన్న! మంత్రిగారి స్వార్థ బుద్ధి తమ్ముడిని రెచ్చకొడుతుంది. కథాంతంలో తమ్ముడికి జ్ఞానోదయం కోసం అన్న యుద్ధం చేయక తప్పలేదు. ఈ యుద్ధం తమ్ముడిమీద ప్రకటించకుండా వేరొకవిధంగా మలచి, తమ్ముణ్ని పశ్చాత్తప్తుడిగా చేసిన నైపుణ్యం గొప్పది!

కథని ముఖ్యమైన పాత్రల చుట్టూ తిప్పడం దర్శకుని చాతుర్యాన్ని ప్రస్ఫుటం చేస్తుంది. తల్లిదండ్రుల్ని నిష్క్రమింపజేసే ముందు—తత్కారణం ఇంకా స్పష్టంచేస్తే బాగుండేది. చిత్రానికి అనవసరాలన్నా, వాటిని సర్వాంగసుందరం చేయడం ఒక విశేషం. జ్ఞానేంద్రుడి కథ కథకి దూరంగా తీసుకుపోతుంది. కాని వినోదాన్నభిలషించే ప్రేక్షకులకి ఇది ఇష్టాన్న భోజనం!

కాంతారావు కథానాయకుని పాత్రలో వైవిధ్యం అంతగా లేకపోయినా, అతని నటన ఉదాత్తంగా వుంది. టి. గోపాలకృష్ణ దుష్ట పాత్రలో అందెవేసిన చేయిగా నటించాడు. లింగమూర్తి నటనకి ఈ చిత్రం ఒక అద్దం. బాలయ్య సహజ చాతుర్యమైన నటన బాగున్నది. కథానాయకిగా కాంచన చక్కగా నటించింది బాలకృష్ణ, వేళంగి హాస్యపాత్రల పోషణకోసమే అయినా వాణిశ్రీ



'పాపకోసం'లో హిందీ నర్తకి మధుమతి.

నటన తగ్గలేదు. వీరపూజని వైభవంగా జరిపించినవారిలో పద్మశ్రీ నాగయ్య, రేలంగి, జి. వరలక్ష్మి, ఉదయచంద్రిక, రామదాసు, విజయలలిత మొదలైనవారు తమ తమ పాత్రలకి న్యాయం కూర్చారు.

చిత్రానికి సంగీతం ఒక ప్రత్యేకమైన ఆకర్షణ. రసవత్తరమైన సంగీత జల్లులు కురిపించిన ఘంటసాల అభినందనీయులు. ఆమంచర్ల శేషగిరిరావు దర్శకత్వంలో వీర పూజని శోభాయమానం చేసిన నిర్మాతలు పోలవరపు కేశవులు చౌదరి, లింగినేని అప్పయ్య చౌదరుల కృషి ప్రశంసనీయం.

—పీకరాజా



'బ్రహ్మచారి'లో నాగేశ్వరరావు, జయలలిత.

## తమాషా గెటప్

విజయ గార్డెన్స్‌లో విజయ లలిత, రాజబాబు ఆడుతూ, పాడుతూ వున్నారని తెలిసి వెళ్లాను వీ రిద్దరి మధ్య రాజనాల తంటాలు పడడం చూచి ఆశ్చర్యం వేసింది ఎందుకంటే రాజనాలకి అందర్ని ఏడిపించుకు తినటం అలవాటు ఇందులో వీళ్ల చేతిలో కీలుబొమ్మ అయ్యాడు. వీళ్ళ చెప్పిందల్లా చెయ్యడం మొదలెట్టాడు ఈ సన్నివేశాన్ని కొసరాజు ఒక పాటరూపంలో నవజ్యోతి ఫిలింస్ చిత్రానికిగాను క్రిందివిధంగా వ్రాసారు.

మా మయ్య మత్తులో వున్నాడు,



'అందంకోసం పందెం'లో కాంచన,

మన చేతిలో దెబ్బ తిన్నాడు

ఈ పాటను వసంత, జయదేవ్ పాడారు చలపతిరావు స్వరం చేసారు ఈ చిత్రంలో రాజనాల గెటప్ తమాషాగా వుంది. చూడగానే నవ్వు వస్తుంది మీరే చూస్తారుగా మే నెలలో ఫ్రెంచిమీసం, హిట్లర్ క్రాప్, రంగుల షర్టు వేసేప్పటికి రాజనాల ముఖం విచిత్రంగా తయారైంది. శ్రీ తాతినేని రామారావు డైరెక్టు చేసే ఈ చిత్రంలో కాంచన, హరనాథ్, రాజనాల, సత్యనారాయణ, రాజబాబు, విజయలలిత, సూర్యకాంతం మరియు నాగభూషణం ముఖ్య పాత్రల్ని ధరిస్తు



'భార్య'లో విజయలలిత.

# సినిమా

న్నట్లు నిర్మాతల్లో ఒకరయిన వందనం తెలియచేసారు.

### నేపథ్యగాయని వివాహం

వసంత అంటే జ్ఞాపకం వచ్చింది. మన వెండితెర నేపథ్య గాయని అది మాకు తెలియదా? అని మీ రంటారు. అసలు విషయ మేమిటంటే— సౌభాగ్యవతి వసంతకు మార్చి 21 వ తేదీన హైద్రాబాదుకు చెందిన శ్రీ సుధాకర్‌తో ఏడుకొండలస్వామి సన్నిధిలో వివాహం వైభవంగా జరిగింది. సినీ ప్రముఖులు చాలమంది పాల్గొని తమ శుభాకాంక్షలను తెల్పారు. వసంత తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం చిత్రాల్లో సుమారు 300 పాటలు పాడింది. ఈమె



'తల్లిప్రేమ'లో రామారావు, సావిత్రి.

# సినిమా

తమిళంలో పాడిన 'ఏనువాథరే' పాట బహుళ ప్రజాదరణ పొందింది.

### క్లయిమాక్స్ వరకూ తెలీదు

విక్రం స్టూడియోలో కాంతారావు న్యాయపీఠంలో కూర్చుని తీర్పు చెప్తున్నారని తెలిసి అక్కడికి వెళ్ళాను. అక్కడ రాజనాల ఒక వైపు, పుష్పకుమారి ఒక వైపు బోనులో నిల్చుని తమ అభివాదాన్ని తెల్పుతుంటే కాంతారావు, రాజశ్రీ, ప్రభాకరరెడ్డి, సాంతం వినడాన్ని దర్శకులు సుబ్బరామదాస్ మొదటి టేక్‌నే ఓకే చేసారు. రాజనాల, పుష్పకుమారి యెవరో తెలుసా? క్లయిమాక్సువరకు కాంతారావుకు వాళ్ళు తన తల్లిదండ్రులని తెలియదు. ఈ చిత్రం జానపదమే అయినా ప్రణయం, సస్పెన్స్, రొమాన్స్, అడ్వెంచర్‌లాంటి అన్ని అంశాలు ప్రేక్షకులకు రుచించేరీతిగా వీటూరి కథను వ్రాసిపెట్టారు. రాజా పిక్చర్స్ నిర్మిస్తున్న యీ జానపద చిత్రం పది రీళ్ళు తయారైంది. సత్యం కూర్చిన పాటల బాణీలు వీనుల విందుగా వున్నాయి. శ్రీ కాంతారావు, రాజనాల, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రాజబాబు, బాలకృష్ణ, బి. ఎ. శేషయ్య, రాజశ్రీ, గీతాంజలి, మీనాకుమారి ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. రామకృష్ణ కాంతారావు తమ్ముడిగా మరలా నటిస్తున్నారు.

### మూడు నెలల తర్వాత కాస్త తీరిక

విక్రమ్‌నుండి వాహినికి వెళ్ళాను. వాహిని ల్యాబ్‌లో రామానాయుడు కనిపించారు 'మూడుమాసాల తర్వాత కాస్త తీరిక దొరికింది' అన్నారు. 'అంటే షూటింగు అయిపోయిందా' అని అడిగాను 'ఇంకా వాల్యు కాల్‌షీట్లు పని మిగిలివుంది. ఆ తర్వాత 'పాపకోసం' చిత్రాన్ని తమిళం, హిందీ భాషల్లో నిర్మించదల్చాను' అన్నారు నాయుడు. మరి తెలుగు సం॥ తేమిటి అన్నాను 'ఒక పౌరాణిక చిత్రాన్ని ఏప్రిల్‌లో ప్రారంభించాలనుకుంటున్నారు. సముద్రాలకు అడ్వాన్సు కూడ యిచ్చాను. స్క్రిప్టుపని జరుగుతూవుంది. కమలాకర కామేశ్వరరావు డైరెక్టు చేస్తారు' అని చెప్తూ, 'పాపకోసం' చిత్రాన్ని చాల హిట్‌గా నిర్మించామని వెల్లడించారు.

### తదుపరి కార్యక్రమం

వాహిని ల్యాబ్‌నుండి షూటింగు లేమీ లేకపోవడంవల్ల బయటకి వస్తుంటే విజయభట్ మూవీస్ నిర్మాతలయిన భట్, వెంకటేశ్వరరావులు కన్పించారు ' ప్రస్తుతానికి 'అత్తా ఒకింటికోడలే' చిత్రాన్ని కన్నడంలో తీస్తున్నాం. జూలై నుండి నాగేశ్వరరావుతో పాలగుమ్మి పద్మరాజు వ్రాస్తున్న కథను తీస్తాము' అని వారు వెల్లడించారు. 'అత్తా ఒకింటికోడలే' చిత్రాన్ని వై. ఆర్. స్వామి డైరెక్టు చేస్తారు.



జీవితబంధం'లో రాజసులోచన.

### కష్టపడితే ఫలితం

కౌముది ఫిలింస్ ఎం. ఎస్. రెడ్డి తన ఆఫీసులో పాత్రికేయులకు ఫిబ్రవరి 11 న గొప్ప విందు నిచ్చారు. అక్కడ జరిగిన యిష్టాగోష్ఠిలో తన గత చరిత్రను పద్యరూపంలో రెడ్డి వెల్లడించారు. తన బాల్య జీవితం యెంతటి కష్టతరమో వివరించి, కష్టపడితే ఫలితం తప్పక దక్కుతుందని, తన్ను ఒక సినిమా నిర్మాతగా పరిగణించవద్దని, ఒక సాహితీ ప్రియునిగా యెంచి తనపై సర్వదా ప్రేమాభిమానాలను కురిపించమని కోరారు. తాను నిర్మించిన 'భార్య' చిత్రంలో గూడవారు పాతశాల తెలుగు పండితులు శ్రీ కొండమాచార్యులు ఒక పాట వ్రాశారని తెల్పారు విందు అయిన తర్వాత తమ కార్లలో వాహిని 'బి' థియేటరుకు తీసికెళ్ళి 'భార్య' చిత్రాన్ని చూపించారు.

* * *

'ఫూల్ — ఔర్—పత్థర్' హిందీ చిత్రంలో ధర్మేంద్ర, మీనాకుమారి ముఖ్యపాత్రలను ధరించారు. సిల్వర్‌జూబ్లీ చేసుకున్న యిదే చిత్రాన్ని తెలుగులో 'నిండుమనసులు'గా జగన్నాధరావు నిర్మించారు. తెలుగులో పద్మశ్రీ రామారావు, దేవిక నటించారు కదూ! ఇప్పుడు అదే చిత్రాన్ని జెమిని సంస్థ తమిళంలో నిర్మిస్తున్నారు వాణిశ్రీ, ఎం. జి. ఆర్. నాయకీ, నాయకులుగా నటిస్తున్నారు.

## సినిమా డైరీ

● శ్రీ ఎం. ఆర్. రాధా నిర్మిస్తున్న చిత్రంలో జెమినీగణేష్, సావిత్రిగణేష్, శివకుమారు జానకి ప్రధాన పాత్రలను పోషిస్తారు

● 'పావమన్నిప్పు' హిందీ చిత్రంలో సునీల్ దత్ కథానాయకుడిగా నటిస్తారు

● ఎ. ఎల్. ఎస్. ప్రొడక్షన్స్ కన్నడంలో "కల్యాణం పణ్ణియుం బ్రహ్మచారి" చిత్రాన్ని నిర్మిస్తున్నారు ఇందులో నాయకుడు కల్యాణకుమార్

● దక్షిణ భారత ఫిల్మ్, నట సంఘం అధ్యక్షుడిగా శ్రీ కె. ఆర్. రామస్వామి ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు.

● ఫిలిప్పైన్ చిత్ర ప్రదర్శనోత్సవం మేనెల 3వ తేది నుండి 12వ తేది వరకు జరుగుతుంది

● భారత ప్రభుత్వం నిర్మించనున్న "ఎవరెస్టు" చిత్రానికి పద్మశ్రీ శంకర్—జైకిషన్‌లు ఉచితంగ సంగీతాన్ని సమర్పించడానికి అంగీకరించారు

● రవీంద్రా ఆర్ట్స్ నిర్మించే సాంఘిక చిత్రంలో విజయనిర్మల పేదరాలిగా, శ్రీమంతురాలిగా నటిస్తోంది

# సినిమా

## 'మద్రాసునుంచి మకాం మార్చబోయేది లేదు'

పద్మశ్రీ రామారావుకు దక్షిణ ఇండియా ఫిలిం వాణిజ్యసంఘం యేర్పాటు చేసిన సభకు మాజీ మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్ అధ్యక్షత వహించారు వేదికను ఎం జి ఆర్., సుందర్‌లాల్ నహతా, జగ్గయ్య, ఎ. ఎల్. శ్రీనివాసన్, ఎస్. ఎ. సుబ్బరామన్ అలంకరించారు.

అధ్యక్షులు ప్రసంగిస్తూ రామారావుకు 'పద్మశ్రీ' చాలదని, ముమ్ముందు యింకా యింకా విలువయిన బిరుదాల్ని పొందాలని ఆకాంక్షిస్తున్నట్లు వెల్లడించారు. శ్రీ సుందర్‌లాల్, జగ్గయ్య రామారావు నటనా వైదుష్యాన్ని, హృదయ ఔదార్యాన్ని ప్రస్తుతించారు. శ్రీ ఎ ఎల్. శ్రీనివాసన్ మాట్లాడుతూ మద్రాసు మహానగరంలో ఒక మంచి థియేటరును రామారావు కట్టాలని కోరుకున్నారు.

శ్రీ ఎన్. టి. ఆర్. సమాధానమిస్తూ, తాను తన కర్తవ్య నిర్వహణలో యెప్పుడూ వెనుకడుగు వెయ్యనని హామీ యిస్తూ, తావే మద్రాసులో వుండగా థియేటరు కట్టడం దేనికని ముచ్చటించారు. నేను మద్రాసునుండి మకాం మార్చబోయేది లేదు, కాకపోతే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పరిశ్రమకు చేస్తున్న సహాయాన్ననుసరించి అక్కడ స్టుడియో నిర్మిస్తున్నట్లు, యిక్కడ, అక్కడ కూడ నిర్మితమయ్యే చిత్రాల్లో నటించనున్నట్లు వ్యక్తపర్చారు.

* * *

క్యారెక్టర్‌యాక్టర్ యస్. వి. రంగారావు నిర్మిస్తున్న, దర్శకత్వం వహిస్తున్న 'బాంధవ్యాలు'యొక్క షూటింగు వెల్లూరుకు అమడ దూరంలోగల మైపాడులో ఫిబ్రవరి 12నుండి 18వరకు షూటింగు జరిగింది. ఈ షెడ్యూలులో చంద్రమోహన్, గుంటూరు వెంకటేష్, సారథి, మోదుకూరి సత్యం పాల్గొన్నారు రెండు పాటల చిత్రీకరణ జరిగింది. సాలూరి హనుమంతరావుకు సంగీత దర్శకత్వాన్ని అప్పగించిన రంగారావును అభినందిస్తున్నాం. చిత్రంలోని ప్రధానపాత్రలను సావిత్రి, రాజనాల, ధూళిపాళ, చంద్రమోహన్, లక్ష్మి మరియు రంగారావు పోషిస్తున్నారు

## ప్రతిచిత్రంలో ఎక్స్‌పెరిమెంట్

రాజ్యలక్ష్మి నిర్మాతల్లో ఒకరయిన డూండేశ్వరరావు ప్రతిచిత్రంలో యేదో ఎక్స్‌పెరిమెంట్ చేస్తూవుంటారు 'గూఢచారి 116' చిత్రానికి మల్లికార్జునరావును దర్శకునిగా పరిచయంచేసారు. 'మరపురానికథ'లో వాణిశ్రీని కథానాయికగా ప్రేక్షకులకు కన్పింపచేసారు ఇప్పుడు తమిళంలో విజయవంతంగా ప్రదర్శింపబడ్డ 'తంగై' చిత్రాన్ని శ్రీ మల్లికార్జునరావు దర్శకత్వంలో తెలుగులో నిర్మిస్తున్నారు ముఖ్యపాత్రలను కృష్ణ, చంద్రకళ, రాజబాబు, ముక్కామల ధరిస్తారు. శ్రీ చలపతిరావు రెండు పాటలను రెడీ చేసివుంచారు. ఈ చిత్రంలో అప్పలాచార్యులను సంభాషణలు వ్రాసేందుకు నియమించారు.


'సుఖదుఃఖాలు'లో జయలలిత

* * *

మొన్న, 'మంచి కుటుంబం' నిర్మాత మల్లికార్జునరావును కలిసాను మల్లికార్జునరావు, బాబ్జీలు కలిసి 'వాన్' చిత్రాన్ని నిర్మిస్తున్నట్లు చెప్పారు. శ్రీరామచంద్రరావు దర్శకత్వంలో కృష్ణ, కాంచన, నాగభూషణం ముఖ్యభూమికల్ని ధరిస్తారు, 'చిలకా–గోరింకా' నాయకుడు కృష్ణంరాజుకు యీచిత్రంలో ప్రముఖపాత్ర యివ్వబడింది ఈ పాత్రను తమిళంలో మనోహర్ ధరించాడు.

## 'స్క్రిప్ట్ రెడీగా ఉంది'

గత మూడునెలలుగా అనారోగ్యంగా వుండిన శ్రీ యు విశ్వేశ్వరరావు యిప్పుడు కోలుకుంటున్నారు. ఈ మధ్య వారిని


'లక్ష్మీనివాసం'లో శోభన్‌బాబు, వాణిశ్రీ.

## మీకు తెలుసా?

● పి. ఎ. పి. సుబ్బారావు సిల్కు ఫుల్ స్లీవ్‌డ్ షర్టు, గ్లాస్కో పంచెను ఎల్లప్పుడూ ధరించడం అలవాటు.

● బి. విఠలాచార్యకి యెప్పుడూ తెల్లటి దుస్తులను ధరించడం అంటే యిష్టం.

● విశ్వశాంతి విశ్వేశ్వరరావుకి సిల్కు చొక్కా, మేలిరకం కండువా పంచెను ధరించడం పరిపాటి.

● డి. వి. ఎస్. రాజు టెర్లిన్ ఫుల్ షర్టు, టెరికాటన్ ప్యాంటుతోనే కనిపిస్తారు.

● రాజనాలకి తీరిక దొరికినప్పుడల్లా లక్ష్మీఅష్టోత్తరం చెయ్యడం అలవాటు.

● పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు ఖద్దరు దుస్తులనే వుపయోగిస్తారు.

● పద్మశ్రీ రామారావు, రాజనాలను 'మామాజీ' అని పిలుస్తారు.

● నటుడు రామకృష్ణ ప్రభాకర రెడ్డిని 'మామాజీ' అని పిలుస్తారు.

● తాతినేని చలపతిరావు వక్క పొడుంను యెక్కువగా నములుతుంటారు.

● వేదాంతం రాఘవయ్యను పద్మశ్రీ అక్కినేని 'తాతయ్య' అని పిలవడం పరిపాటి.

● నటుడు రామకృష్ణ మంచి డాన్సర్ కూడా.

కలిసినప్పుడు తమ మూడవచిత్రంయొక్క స్క్రిప్టు రెడీగావుందని, ఏప్రిల్‌నుండి, షూటింగు ప్రారంభిస్తామని చెప్పారు. నాయకపాత్రను పద్మశ్రీ రామారావు ధరిస్తారు. కె. వి. మహదేవన్ పి. లీల పాడిన పాటను డిసెంబరు 23న రికార్డుచేసి వుంచినట్లు చెప్పారు.

*     *     *

తిరుమలా పిక్చర్స్ 'ప్రేమికథ' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. రవిచందర్, కె. ఆర్. విజయ, నాగేష్ ప్రధానపాత్రలను పోషిస్తున్నారు. మాటలు, పాటలను ఆ సెనిట్టి వ్రాసారు. సంగీతాన్ని తాతినేని చలపతిరావు సమకూర్చారు. మార్చి మాసాంతంలో యీచిత్రం విడుదలకాగలదని నిర్మాతలు శ్రీరామమూర్తి, సత్యనారాయణ వివరించారు. మేనెలలో ఒక చక్కటి యితివృత్తంగల సాంఘిక చిత్రాన్ని నిర్మించదల్చినట్లు వెల్లడించారు.

*     *     *

పద్మశ్రీ రామారావు ఎన్. వి ఎన్. ఫిలింస్, ఉషా ఫిలింస్, ప్రతిమా ఫిలింస్, శేఖర్ ఫిలింస్, విఠల్ ప్రొడక్షన్స్, గౌతమీ పిక్చర్స్, సిరి ఆర్ట్సు పిక్చర్స్, తారకరామా పిక్చర్స్, సీతారామాంజనేయ పిక్చర్స్ నిర్మించే చిత్రాల్లో కథానాయకుడిగా నటించేందుకు అంగీకరించారు.

పద్మశ్రీ నాగేశ్వరరావు బాబామూవీస్, విజయభట్ మూవీస్, జగపతి పిక్చర్స్, మధు పిక్చర్స్, ఎ. వి. ఎం. పిక్చర్స్, మాధవి పిక్చర్స్, రవీంద్రా ఆర్ట్సు పిక్చర్స్ భరణి పిక్చర్స్, విజయ ప్రొడక్షన్స్, అంజలీ పిక్చర్స్, రాజశ్రీ పిక్చర్స్, రాజ్యలక్ష్మి పిక్చర్స్ నిర్మించే చిత్రాల్లో నాయకుడిగా నటించడానికి సమ్మతించారు.

### మరపురాని పాత్ర

'ఇందిర భర్తగా వుండడానికన్నా, ఇందిర నవుఖరుగా వుండడం నీకు యిష్టమా' అన్నచోట శ్రీమతి జమున చూపిన నటన అద్భుతం. ఈ సన్నివేశం గౌరి ప్రొడక్షన్స్ నిర్మించిన 'పాలమనసులు' చిత్రంలోనిది. శ్రీమతి జమున నటజీవితంలో యీ పాత్ర మరపురాని, మరువలేనిపాత్ర. ఎంత బరువయిన సన్నివేశాన్నయినా, సునాయాసంగా, సహజంగా నటించగల సామర్థ్యం ఆమెలో వుందని నిరూపించే పాత్ర 'పాలమనసులు' చిత్రంలోని ఇందిర భూమిక. శ్రీ వై. వి. రావ్ నిర్మించిన యీ చిత్రం గౌరి ప్రొడక్షన్స్‌కు బ్యానర్ వేల్యూను తెచ్చిపెట్టగలదనడంలో సందేహంలేదు. మంచి చిత్రాలకోసం వేచి వేసారుతున్న ప్రేక్షకులకు 'పాలమనసులు' చక్కటి విందు.

### తప్పని సరైనమార్పు

నందనా ఫిలింస్‌లో హరనాథ్ నటిస్తారని లోగడ అనుకున్నారు. కానీ, మొన్న ముళ్ళపూడి వెంకటరమణను కలిసినప్పుడు హరనాథ్ కాల్‌షీట్లు కుదరనందువల్ల ఆయనకు బదులుగా వేరొక నాయకుడు నటించగలడని, చిత్రంయొక్క షూటింగు హైద్రాబాదు నగరంలో జరుగగలదని, ముఖ్యపాత్రలను విజయనిర్మల, రంగారావు (సాక్షి) రాజబాబు ధరిస్తారని వివరించారు. హరనాథ్ తమ పిక్చర్‌లో లేనందుకు చాల బాధపడ్డారు. ఆ తేదీల్లో హరనాథ్‌కు నవజ్యోతి షూటింగువుండడం వల్ల యీ మార్పు తప్పనిసరి అయింది.

—శ్రీనివాస్ ●



'అనుభవించురాజా అనుభవించు'లో ఉయుభారతి, నాగేష్.

# పుస్తకాలు

## చుక్ గెక్ : అన్నదమ్ములు

రచన: ఆర్కాదిగైదార్ అనువాదం: ఉప్పల లక్ష్మణరావు ప్రచురణ: ప్రగతి ప్రచురణాలయం, మాస్కో. ప్రతులకు విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ. పుటలు: 59 ధర: రూపాయిన్నపావలా.

అందమైన బొమ్మలతోగాని కొన్నికొన్ని పుస్తకాలు మొదటి చూపులోనే మనస్సును ఆకర్షిస్తాయి. 'చుక్, గెక్— అన్నదమ్ములు' చిన్న పిల్లలకోసం ఉద్దేశింపబడిన పుస్తకమైనా వయోభేదం లేకుండా అందరినీ ఆకర్షించే పుస్తకం. అట్టమీద సుందరమైన నీటిరంగుల చిత్రం, లోపల ముద్దులొలికే ఎన్నో చిత్రాలు. పుస్తకమంతా కుదురైన అక్షరాలతో ఆర్ట్‌పేపర్‌మీద ముద్రించడం. ముందు కనువిందుచేసి తర్వాత మెదడుకు మేత అందిస్తుంది. కథలో సరళత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. చుక్‌గెక్ ఇద్దరూ చిన్న పిల్లలు అన్నదమ్ములు. వాళ్ల అమ్మతోకలిసి నాన్నవున్న వూరికి బయల్దేరుతారు. బయల్దేరే సమయానికి ఓ టెలిగ్రాం వస్తుంది. కాని అది వాళ్లమ్మతో చెప్పరు. రైలు ప్రయాణం వాళ్లకు సంభ్రమాశ్చర్యాన్ని కల్గిస్తుంది. ఎన్నో బాధలకు తట్టుకుని వాళ్లనాన్నవుండే స్థలం చేరుకుంటే అక్కడ ఆయన వుండడు. కాపలి జవాను వెళ్లి తండ్రిని పిల్చుకువచ్చే లోపున ఆ నిర్జనారణ్య వాసభూమిలో పిల్లలభయమూ పాడూవీడీ అంతా ఇంతాకాదు. సంవత్సరాదినాడు వాళ్లనాన్న మిగిలినవాళ్ళు వస్తారు. అంతాకలిసి పండుగ చేసుకుంటారు. ఇలాటి చిన్న కథను గైదార్ చెప్పిన పద్ధతి పరమరమణీయంగా వుంది. చుక్‌గెక్‌ల అల్లరి, పసిమనసులు ఎంతో ఆర్ద్రంగా, చక్కని అనుభవంతో గైదార్ చిత్రిస్తాడు. అనువాదకర్త శ్రీలక్ష్మణరావుగారు ఆ సహజ సుందరశైలిపటిమని తన అనువాదంలో జారిపోనీయకుండా ఎంతో జాగ్రత్త తీసుకున్నారు. కాని, "సోఫామీదనుండి అంతర్లు కొట్టడం", "స్ప్రింగుల ఝూంకారం చెయ్యడం," "ముఖాన్ని వతించడం," "రొట్టెపిసళ్ళ"వంటి ప్రయోగాలు ఆ యనవి మార్చకుండా వుండవలసింది. ఎక్కడో మాస్కో నగరంలో ఇంత అందమైన తెలుగు పుస్తకాన్ని, అచ్చుతప్పులు లేకుండ ముద్రించారంటే, తెలుగు గడ్డమీదవున్న ప్రచురణకర్తలూ, ముద్రాపకులూ సిగ్గుతో తల వంచుకోవాలి. తెలుగు పిల్లలకోసం, అచ్చతెలుగు వాతావరణంతో ఒక పుస్తకం, కనీసం ఒక్క పుస్తకం, ఇటువంటిది వచ్చినా, తెలుగువాడై పుట్టినందుకు నేనెంతో గర్వపడతాను. అప్పటిదాకా సోవియటు ప్రజలను అభిమానించడం, అభినందించడం తప్పదు.

—శ్రీరామచంద్రమూర్తి

## అతకని అంతర్యాలు
## (కథల సంపుటి)

రచన: శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు. క్రౌన్ 1/8 సైజు 203 పేజీలు వెల: రు. 4 ప్రతులకు బృందావన్ పబ్లిషింగ్ హౌస్, మారిస్‌పేట, తెనాలి.

కొన్ని చిన్నవీ, కొన్ని పెద్దవిగా పడిచిన ఇందులోని పదిహేను కథలనూ— కథ లనడంకంటె జీవిత తరంగా లనడం యుక్తంగా వుంటుంది ఈ తరంగాలలో రచయిత పదిహేను రకరకాల వ్యక్తుల మనస్తత్వాలను చిత్రించారు.

అతకని అంతర్యాలు— ఒకప్పుడు తన ప్రేమ కాదన్న ఇందిరను పెళ్లాడేందుకు తిరస్కరిస్తాడు దశమారిన చంద్రశేఖరం.

నిన్ను దూరం చేసుకోలేను— రెండవ పెళ్లి చేసుకున్నా, తన సుఖంకంటె కన్నకొడుకు సుఖమే ఎక్కువ అని గ్రహించిన కేశవరావు కథ.

సహృదయులు— సహృదయతతో సవతి కూతురు మనసు తెలుసుకుని, మనువు కుదిర్చిన జానకమ్మ త్యాగం.

అనూరాధ:— తలిదండ్రులకు ఇచ్చిన మాట కోసం ప్రేమను త్యాగంచేసిన ఒక త్యాగశీలి గాథ.

ఓడిపోయిన నిజం— లోకంలో నిజానికి విలువ లేదని కనిపెట్టిన రిక్షావాలా రాఘవులు అనుభవం.

జానకి విజయం:— అందం డబ్బుతోనే శోభిస్తుందని చెప్పే ఒక నీతికథ.

కర్తవ్యం — వేరింటి కాపరంలో ఆనందాన్ని ఆశించే ఒక కోడలు— వనజకి గుణపాఠం.

నమ్మని నిజం:— ఒక అనాథ గాథ.

తప్పులేని శిక్ష:— సంఘంలో ఒక పిచ్చిసమ్మకానికి చిత్రణ.

సమానాంతర రేఖలు— మొట్టమొదటి కథ లాంటిదే.

సహృదయం— సౌందర్యం:— బాహ్య సౌందర్యం కంటె హృదయ సౌందర్యమే గొప్పది అనటానికి నిరూపణ.

అంతర్యాలు— అందమైన అమ్మాయి అభినందించినా చిక్కే!—

పరాజిత— కోడలు మెచ్చిన అత్తకథ, అత్తకు నచ్చిన కోడలు కథ.

మనసు విలువ:— స్త్రీలో ఎంత సహనం ఎంత త్యాగం వున్నాయో తెలుసుకున్న ఒక పురుషుని ఉదంతం.

తస్మాత్ జాగ్రత్త:— పండువంటి సంసారాల్లో చిచ్చు రగల్చటానికి తులశమ్మలాంటి కొందరుంటారు, జాగ్రత్త'— అనే ఒక హెచ్చరిక.

కాలక్షేపానికి ఉపకరించే ఈ కథాసంపుటిలో కథలన్నీ ఒడుదుడుకులు లేకుండా సామాన్యంగా సాగిపోయాయి. ఇంకా ప్రతిభ, ప్రత్యేకత, నవ్యతలతో కూడిన కథలను రచయిత నుంచి ఆశించవచ్చు.

— శితతుమూరి



## ఇండియాలో జపాన్ టేబుల్ టెన్నిస్ బృందం



దేశంలోనూ, విదేశాల్లోనూ టేబుల్ టెన్నిస్ పోటీలకి విస్తృతమైన అవకాశాలు ఉన్నాకూడా భారతదేశం అంతర్జాతీయ స్థాయిలో అభివృద్ధిని సాధించినట్లు కనిపించదు. అయితే జరుగుతున్న ప్రచారం, ఆటలోకి తీసుకోబడుతున్న ఆటగాళ్లని బట్టి చూస్తుంటే మాత్రం దేశంలో బ్రహ్మాండమైన అభివృద్ధి జరుగుతున్నదనటంలో సందేహంలేదు ! ప్రభుత్వం శిక్షణపథకాలు, ఎన్నో క్లబ్‌లు కల్పిస్తున్న అవకాశాలవల్ల దేశంలో జరిగే అభివృద్ధికి యిటీవలి జపాన్‌బృందం పర్యటన మరింత దోహదంచేస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రపంచ పోటీలో విజయాన్ని సాధించినబృందంలోని ఏసభ్యుడిని తమలో చేర్చుకోకుండానే జపాన్ టెబుల్ టెన్నిస్‌బృందం అసమాన ప్రతిభని ప్రదర్శించింది.

ఇటో, మేది, నిషి, తసాకాలు హైద్రాబాద్, బెంగుళూరు, మద్రాసు, మధురై తదితరప్రాంతాల్లో పర్యటించారు. వాళ్ల ఆట ప్రపంచ ఆటగాళ్లు ఎంత ప్రతిభావంతులో వివరించే విధంగా ఉంది జపాన్ నెం. 1 ఆటకాడు ఇటో నాలుగు టోర్నమెంట్‌లలో ఒకదాన్ని గెలుచుకున్నాడు. తక్కినపరకం ఆటవాళ్లయిన మేది, నిషిలతో మిగతావాటిలో గెలుపు లభించింది.

జపాన్ ఆటగాళ్ల 'పెన్‌హోల్డర్ గ్రిప్', చాకచక్యం, చాతుర్యం అనే మూడు అంశాలూ విలువైనవి కావటానికి వాళ్ల కదలికల్లో, నిర్ణయాల్లో ఆలస్యం లేకుండా ఉండటమే కారణం. ఇవే మనవాళ్లు నేర్చుకోతగినవి. ఆటమీద లక్ష్యం అనేది ఉండటం అతి ముఖ్యమైన విషయం అనేది కూడా మన ఆటకాళ్లు నేర్చుకోవాలి.

మద్రాసు ఇన్విటేషన్ టోర్నమెంట్‌లో వి. ఎం. మర్చంట్, ఓ జగన్నాథ లిద్దరికీ ఇటో, తసాకాల నుంచి కనీసం ఒక్క ఆటనన్నా గెలుచుకున్న ఖ్యాతి దక్కింది. కాని జపాన్ బృందం యింతవరకూ ఒక పోటీలో కూడా ఓడిపోలేదు.

*   *   *

మరొక అంతర్జాతీయ బృందం కూడా మన ఆటగాళ్లకి మంచి పాఠాన్ని నేర్పింది. జమైకాలో ఫిబ్రవరి 13 న జరిగిన ఆటలో సోబర్స్ ప్రపంచంలో పెద్ద క్రికెట్ ఆటకాడుగా నిరూపించుకున్నాడు. ఇంగ్లాండే విజయం సాధిస్తుందని అనుకొన్నదానిని తన కనుకూలంగా, తనొక్కడి ప్రయత్నంతోనే మార్చుకోగలిగాడు.

వెస్టు ఇండీస్‌కి ఈ స్థానం లభించడానికి వారి ఆటకాళ్ల పట్టుదల, స్థిర నిర్ణయాలే కారణాలు ఆటమీద వారికి ఎంత లక్ష్యం ఉందో సోబర్స్ ప్రదర్శించాడు. భారతీయుల బాటింగ్‌లో చాతుర్యం, మనోనిబ్బరం ఏకాగ్రత అన్నవి లోపించడం మనకి తెలిసింది. బొంబాయి బాట్స్‌మెన్ ఏకాగ్రతకి పేరుపొందారు. అందువల్లే భారతదేశంలోని క్రికెట్ రంగంలో వాళ్లు అగ్రాసనాన్ని అందుకుంటున్నారు. మిగతా ఆటకాళ్లు కూడా లక్ష్యంతో ఆడితే వారికి తీసిపోరు. వెస్టు ఇండీస్‌తో ఆడిన ఆటలో మన జట్టుకి విజయం కొద్దిలో తప్పిపోయింది. అందుకు కారణం ఏకాగ్రత కొరవడటమే. భారత బృందం నాయకుడు పాటవుడీ నవాబు శారీరకమైన లోపాలున్నప్పటికీ మంచి కృషి చేశాడు. కాని మిగతావారు ఆటకి కావలసిన లక్ష్యాన్ని, మనో నిబ్బరాన్ని ప్రదర్శించలేకపోయారు. పైపై మెరుగుల ఆట పండేంలో గెలవడానికి ఎంత మాత్రం ఉపయోగపడదని వారు గ్రహించాలి.

— కె. ఎస్ నరసింహన్

# వస్తువులను పెట్టుటకు ఖీరా క్యాబినెట్లు !

ఖీరా క్యాబినెట్లు త్రుప్పుపట్టని మరియు ముక్కలుగా ఊడని ఉక్కుతో ఎంతో అందమైన ఫినిష్ యివ్వబడి తయారుచేయబడ్డాయి. ఇవి ఎన్నో ఏళ్లు పాడవకుండా మన్నుతాయి. మీ విలువైన వస్తువులను భద్రముగా పెట్టుకొనుటకు ఖీరా స్టీల్ క్యాబినెట్లు ఎంతో అనువుగా ఉంటాయి. ప్రతి క్యాబినెట్‌కు గట్టిగా తాళము పడే ఏర్పాటు ఉంది. మీకు కావాలంటే వీటి షెల్ఫులను మార్చి పెట్టవచ్చును మరియు అదనపు హాంగులను పెట్టుకోవచ్చును. ఆఫీసులో లేక యింట్లో ఎక్కడైనాసరే, మీ వస్తువులను భద్రముగా పెట్టుకొనుటకు ఖీరా క్యాబినెట్లనే కొనండి !



'యుటిలిటీ': 1971 మి.మీ. x 910 మి.మీ. x 481 మి.మీ. (78"x36"x19")



'పాప్యులర్': 1641 మి.మీ. x 831 మి.మీ. x 481 మి.మీ. (65"x33"x19")



'మిడ్జెట్': 1270 మి.మీ. x 760 మి.మీ. x 481 మి.మీ. (50"x30"x19")




ఖీరా స్టీల్ వర్క్స్ ప్రైవేట్ లిమిటెడ్
స్వామి వివేకానంద రోడ్, సాంతాక్రుజ్, బొంబాయి-54

IWT-KSW 4883

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

